సంపాదకీయం....

# కల్లోలాలకు కారకులెవరు?

ఈనాడు సమాజంలో ఎక్కడచూచినా కల్లోలాలు, కలహాలు, జగడాలు పెచ్చుపెరిగిపోతున్నాయి. మారణహోమాలు జరుగుతున్నాయి. విధ్వంసం సృష్టించబడుతున్నది. ప్రభుత్వ, ప్రైవేటు ఆస్తులు ధ్వంసమై పోతున్నాయి. పశుత్వభావాలు పెచ్చుపెరిగిపోతున్నాయి. రాక్షసత్వం విలయతాండవం చేస్తున్నది. మానవత్వం కోల్పోయి తమ తోటిమానవులనే నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపుతున్నారు, కర్కశంగా నరికి ముక్కలు చేస్తున్నారు. అరాచకాలకు, అకృత్యాలకు హద్దూపద్దూ లేకుండా పోతున్నది. ఈ అశాంతికి కారకులెవరు? ఈ కల్లోలాలకు కారకులెవరు? ప్రభుత్వమా? పాలకులా? రాజకీయ పక్షములా? అతివాదులా? నక్సలైట్లా? విదేశీ ఏజంట్లా? ఏ ఒక్కరూ కాదు. 'ఈ మారణహోమాలకు ఏదో ఒకరూపంలో అందరూ బాధ్యులే. ఈ కల్లోలాలకు అందరూ కారకులే', అంటే ఆశ్చర్యం వేస్తుంది. అయితే ఇది వాస్తవం, యదార్ధం అనటంలో ఏ మాత్రం అతిశయోక్తికాదు.

ఈనాడు ఏమూల, ఏ చిన్న సంఘటన జరిగినా, పదిమందీ చేరటం, నినాదాలివ్వటం, కోర్టుకెక్కటం, రాస్తారోకోలు చేయటం, రోడ్డు మీద వెళ్ళుతున్న ప్రభుత్వ జీపులను, ఆర్.టి.సి. బస్సులను తగులబెట్టడం పరిపాటి అయింది. తరువాత పోలీసులు రావటం లాఠీలు ప్రయోగించడం, బాష్పవాయువును ఉపయోగించడం, ఆందోళనకారులు రెచ్చిపోయి పోలీసులపై రాళ్ళురువ్వటం, కంటపడిన ప్రభుత్వ, ప్రైవేటు వాహనాలకు నిప్పంటించడం, చివరకు పోలీసు కాల్పులు జరపటం, అమాయకులు మరణించడం, కోపంతో ప్రదర్శకులు బజారునపడి దుకాణాలను ధ్వంసం చేయటం కూడా పరిపాటి అయింది.

ఒకవేళ శాసనసబ జరుగుతుంటే, శాసన సబలో పోలీసు కాల్పులపై న్యాయవిచారణ జరిపించాలని ప్రతిపక్షాలు పట్టుపట్టటం సబాకార్యక్రమాలు నడవకుండా అడ్డుతగలడం, గందరగోళాన్ని సృష్టించడం, శాసన సభలో మైకులు, బల్లలు విరగగొట్టడం, సభామర్యాదను లెక్కచేయకుండా ప్రవర్తించడం, చిట్టచివరకు ఒకరిపై మరొకరు చెప్పలు విసురుకోవడం, స్పీకర్ పోడియంవద్దకు దూసుకొనివెళ్ళి సభా కార్యక్రమాలను స్థంబింపజేయటం, ఆఖరుకు కొందరు ప్రతిపక్ష సభ్యులను సస్పెండ్ చేయటం, మార్షల్స్ సస్పెండ్ చేయబడిన శాసనసభ్యులను మోసుకొని బయటకు తీసుకొనివెళ్ళటం, బయటకు పంపబడినవారు శాసనసభ సింహద్వారం వద్ద ధర్నాలు జరపడం ఈనాడు అన్ని శాసనసబల వద్ద జరుగుతున్న తతంగం ఇదే.

ప్రభుత్వాలు పన్నులు విపరీతంగా పెంచడం, దానిని ఆసరాగాగైకొని ప్రతిపక్షాలు ఉద్యమాలు జరపటం, సత్యాగ్రహాలు చేయటం, దర్నాలు నిర్వహించడం, రాస్తారోకోలు చేయించటం, ఊరేగింపులు జరపటం, నిరాహార దీక్షలకు కూర్చోవటం, ఆఖరికి 'చలో అసెంబ్లీ' నినాదమివ్వటం ప్రదర్శకులు రాకుండా ప్రభుత్వం అడ్డంకులు పెట్టటం, ఏదో విధంగా శాసనసబా సమీపానికి చేరుకోగలిగిన ప్రదర్శకులు 'బారకేడ్స్' ను ఛేదించుకొని, పోలీసుల వలయాన్ని దూసుకొని ముందుకు వెళ్ళటం, పోలీసులు లాఠీలు ప్రయోగించటం, బాష్పవాయువు ప్రయోగం, ఆఖరికి పోలీసు కాల్పులు, అమాయకులు మరణించటం కూడా మామూలే అయింది.

ఈ దుస్థితికి, విషాద స్థితికి ఎవరు ఎంత వరకు బాధ్యులు? 'తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళు' అని భీష్మించుకొని సడలింపులేని మొండి వైఖరిని ప్రదర్శించే ప్రభుత్వాలు, వచ్చిన అవకాశమును జారవిడుచుకోకుండా, తమ స్వార్థప్రయోజనాలకు ఉపయోగించుకొనే మనస్తత్వంగల ప్రతిపక్షాలు, దేశంలో ఏదోవిధంగా అల్లరులను, అల్లకల్లోలాలను సృష్టించడమే పరమావధిగా పెట్టుకున్న అతివాదులూ, నక్సలైట్లు, విదేశీ ఏజంట్లు - వీరందరూ ఏదోఒకరూపంలో ఈ కల్లోలాలకు కారణభూతులే అవుతున్నారు. ఈ దేశంనాది, ఈ దేశ సంపద ప్రజలది, మనందరిది అనే భావం రానురాను పౌరులలో సన్నగిల్లిపోవడం వలన పెంపొందించు కొనవలసిన నైతిక విలువలు దిగజారిపోవటం వలన ప్రజాప్రతినిధులు పాటించవలసిన ETHICS (నీతిసంబంధమైన విషయాలు) ను సక్రమంగా పాటించకపోవటం వలననే , నేడు దేశంలో కల్లోలాలు చెలరేగి శాంతిభద్రతలకు విఘాతం వాటిల్లుతున్నది.

"నీవు వేరు, నేను వేరు అనే స్వార్థస్వప్రయోజనాలు అధికం కావటం చేతనే ఈనాడు ఈ కలహాలు, కల్లోలాలు అధికమైపోతున్నాయి. ఈ వేళ్ళు మనవి. ఈ కన్నులు మనవి. ఏ వ్రేలుతో పొడుచుకున్నా మన కన్నులకే ముప్పు. ఏదో కంపెనీ అని, ప్రభుత్వ ఆస్తిఅని, అది మనదికాదనే భావంతో విధ్వంసానికి పూనుకుంటున్నారు కొందరు. నిజానికి అది అంతా మనదే. దానికి నష్టం కలిగితే మనకు నష్టం కలిగినట్లే. విప్లవాలతో మనం ఎట్టి కార్యమును సాధించలేము. ఈనాడు కావల్సింది కల్లోలంకాదు, కార్యాచరణ. కనుక ప్రేమతో జీవించి, ప్రేమతో కార్యం చేసి, ప్రేమతో అన్యోన్య అనురాగములను పెంచుకొని, మానవత్వాన్ని అభివృద్ధి పరచుకోవాలి. ప్రేమ ఉన్నచోట ద్వేషమునకు అవకాశమే ఉండదు" అని భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు సందేశమిచ్చారు. ఆ దివ్యసందేశమును ప్రతి పౌరుడు ఆలకించి అర్ధం చేసుకొని, ఆచరణలో పెట్టగలిగినప్పుడు మన దేశమేకాదు, యావత్ ప్రపంచం కూడా సుఖసంతోషాలతో విలసిల్లుతుంది. శాంతి సౌభాగ్యాలు విరాజిల్లుతాయి.

మచిలీపట్నం,
ది. 1-9-2000

కొమరగిరి కృష్ణమోహనరావు

సెప్టెంబరు 2000

సంపుటి 16 సంచిక 9


మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
© 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of ***"SREEVANI"*** Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***


| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా | | |
| (4 సం॥లకు) | : | 50 $ |


*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**7-09-2000**


# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



*సవరణ:* ఆగష్టు 2000 ముఖచిత్రం జాతీయ కవి శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణకు బదులు శ్రీ గరిమెళ్ళ కృష్ణమూర్తిగా ప్రచురించబడినది. పొరపాటుకు చింతిస్తున్నాము.

ముఖచిత్రం

 **శ్రీ శరత్‌బాబు** 

# సాయిమాత సన్నిధిలో వరలక్ష్మీ వ్రతం

శ్రావణమాసం వచ్చిందంటే మంగళగౌరీ వ్రతాలు, వరలక్ష్మీ వ్రతాలు, చేమంతిపూలు, పట్టుచీరల రెపరెపలు, పేరంటానికి వెళ్ళివచ్చే ముత్తయిదువుల హడావుడి గుర్తుకు వస్తాయి. అయితే ఈ సంవత్సరం ప్రశాంతినిలయ వాసులకు శ్రావణ శుక్రవారం ఒక దివ్యానుభూతిని అందించింది. స్వామి బంధువులు కొందరు వరలక్ష్మీ వ్రతాన్ని స్వామి సమక్షంలో జరుపుకోవాలని సంకల్పించి, స్వామి నుండి ఆశీస్సులు అందుకుని, వారితో పాటు మరి కొందరికి ఈ మహదవకాశాన్ని కల్పించారు, వారిలో నేను కూడ ఒకరిని కావటం నా మహద్భాగ్యం.

ఆగస్టు 11వ తేదీన ఉదయం 5 గంటలకు కుళ్వంత్ హాలులో ఆహ్వానితులం 155 మందిమి ఆసీనుల మయ్యాం. స్వామి బంధువులు స్వయంగా అందరికీ కుంకుమ, పసుపు, పూలు యిచ్చారు. తరువాత ఒకటొకటిగా పూజ సామగ్రి-లక్ష్మీరూపు, రెండు వెండి గిన్నెలలో పసుపు, కుంకుమ ఒక ప్లేటులో పూలు, అక్షింతలు, పండ్లు, ఆకువక్కలు యిచ్చారు.

స్వామి గం॥ 7-00లకు దర్శనం యిస్తూ అందరి వంకా ఆదరంగా చూసి నవ్వులు చిలకరించారు. మేమందరం ఆ ఆహ్లాదం నుండి కోలుకోకముందే జ్యోతిని వెలిగించి పూజను ప్రారంభించటానికి పురోహితునికి అనుజ్ఞను యిచ్చారు. పురోహితులవారు వ్రతాన్ని శాస్త్రోక్తంగా విఘ్నేశ్వరుని పూజతో ప్రారంభించి, శ్రీసూక్త విధానంతో లక్ష్మీపూజ, తోరంపూజ చేయించి, వ్రతకథ చదివి హారతితో ముగించారు. తరువాత స్వామి అందరికీ వాయనాలు యిప్పించారు. స్వామి.గుప్పెడు నిండుగా అక్షింతలు తీసుకొని ప్రతి ఒక్కరిపైన జల్లుతూ మా అందరి మధ్య నుండి నడుస్తూ వెళుతుంటే, సాక్షాత్ భగవంతుని సన్నిధిలో ఈ వ్రతం చేసుకొని ఆయన ఆశీర్వాదాలు పొందిన మేమెంతటి అదృష్టవంతులమో కదా అనిపించింది.

స్వామి పర్యవేక్షణలో నిర్వాహకులు ఈ కార్యక్రమాన్ని ఎంతో శ్రద్ధా భక్తులతో నిర్వహించినట్లుగా అడుగడుగునా గోచరించింది. ఆ రోజు సాయంకాలం స్వామి తన సందేశంలో "పూజలు ఎందరో ఎన్నోచోట్ల చేస్తూ ఉంటారు, కాని స్థానబలం, సంకల్పబలం, దైవబలం ఈ మూడూ ఇక్కడ మీకు కలిసి వచ్చాయి. మీరంతా ఎంతో అదృష్టవంతులు. వరలక్ష్మీవ్రతం అన్ని వ్రతాలలోకి ఎంతో ప్రశస్తమైనది. అనసూయ, సావిత్రి, సుమతి వంటి పతివ్రతలు ఈ వ్రతాన్ని ఆచరిస్తూ ఎంతో ఆనందాన్ని పొందుతూ వచ్చారు. ఈ ప్రపంచంలో ఎన్నో రాజ్యాలు యుద్ధాలలో నాశనం అయ్యాయి. కాని ఒక్క భారతదేశం స్త్రీ శక్తి వలన ఇలా నిలబడగలిగింది. సుమతి తన పతివ్రతా శక్తితో సూర్యోదయాన్నే ఆపివేసింది. ఎలా? ప్రార్థన చేత. అనసూయ త్రిమూర్తులను పసిపాపలుగా మార్చింది. సావిత్రి మరణించిన తన భర్తను బ్రతికించుకో గలిగింది. వీటిని ఎలా సాధించగలిగారు? పవిత్ర హృదయాలతో, కలియుగంలో కూడ ప్రమాదంలో చిక్కుకున్న భర్తలను రక్షించుకున్న స్త్రీలు ఉన్నారు. వరలక్ష్మీ వ్రతం చేత అష్టైశ్వర్యాలను పొందగలరు.

"స్త్రీలు కంటిధారలు విడువకూడదు. అది ఆ గృహానికే మంచిది కాదు. పురుషులకు మూడు శక్తులు ఉంటే, స్త్రీలకు ఐదు శక్తులు ఉన్నాయి. స్త్రీ తన శక్తితో సాధించలేనిది ఏమీలేదు. నేటికాలంలో ఆధ్యాత్మిక కార్యక్రమాలకు ఆదరణ తగ్గిపోయింది. ఇటువంటి వ్రతాలు ఆచరించే స్త్రీలకు, పురుషులు ఏమాత్రమూ అడ్డు చెప్పకూడదు. తగిన ప్రోత్సాహాన్ని, సహాయ సహకారాలను అందించాలి" అన్నారు.

స్వామి సందేశం స్త్రీలను, పురుషులను కూడ మరొక్కమారు జాగృతం చేసింది. "స్వామి వరలక్ష్మీ వ్రతాలను చేయించటమా" అని ఆశ్చర్యానికి గురి అయిన వారు లేకపోలేదు. వారందరూ ఒక విషయాన్ని అవగతం చేసుకోవాలి. ఆధ్యాత్మిక భావస్ఫూర్తి లేని కార్యక్రమం మన సంప్రదాయంలో ఎక్కడా కనపడదు. అది భారతీయ సంస్కృతి యొక్క విశిష్టత, భౌతికలక్ష్యాలను సాధించటం లోనే తల మునకలు కాకూడదని మన సంస్కృతి అడుగడుగునా గుర్తు చేస్తుంది, మనలను దివ్యపథంలో నడిపించటమే భారతీయ సంస్కృతి లక్ష్యం. స్వామి సందేశంలో ఈ భావం స్పష్టంగా గోచరిస్తున్నది. మన సంస్కృతి మనకందించిన దివ్యజీవన సూత్రాలను గుర్తించి తదనుగుణంగా వర్తించటమే మన కర్తవ్యం.

- దివి సాయిమంగళ

# శ్రీ శరత్‌బాబు

"జగమే మాయ. బ్రతుకే మాయ. వేదాలలో సారమింతేనయా' ఈ పాట వ్రాసింది ఈ వ్యాసంలోని కథా నాయకుడుకాకపోవచ్చు కాని, ఈ పాటకు ఈ వ్యాసంలోని కథానాయకునికి సన్నిహిత సంబంధమే వుంది. పాటకి అదివున్న 'దేవదాసు' చిత్రం తెలుగు దేశాన్ని వూపివేశాయి. దేవదాసు తెలుగువారి హృదయాలలోనేకాక, యావద్భార తీయుల హృదయాలలోను స్థిరపడి పోయాడు. అతని భగ్న ప్రేమ విషాదగాథ ఎవరినైనా కలచివేస్తుంది. పార్వతి, దేవదాసు తెలుగు సాహిత్యంలో సజీవపాత్రలు. అయితే ఈ పాత్రల మూలం బెంగాలీ నవల దేవదాసు అని, ఆ నవలా రచయిత శరత్‌బాబు అని అందరికి తెలుసు.

శరత్ సాహిత్యం తెలుగు దేశాన్ని కుదిపివేసింది. ఉర్రూతలూగించింది. శరత్ తెలుగువాడా అన్నంతగా ఆయన నవలా సాహిత్యం తెలుగు దేశాన్ని ఆక్రమించింది. ముఖ్యంగా 1930-50 సంవత్సరాల మధ్య శరత్ సాహిత్యం తెలుగు దేశాన్ని వుక్కిరి బిక్కిరి చేసిందనడం అత్యుక్తి కానేరదు. ఒక ప్రఖ్యాత రచయిత అన్నట్లు, ఆయన సాహిత్యం వల్ల తెలుగుదేశంలో పెక్కు గ్రంథప్రచురణసంస్థలే వెలిశాయి.

శరత్‌బాబు ఒరవడి తెలుగులో పెక్కు రచయితలకు ఆదర్శమైనది. కొందరు ఆయన శైలిని, ఆయన సృష్టించిన పాత్రలను, ఆ వాతావరణాన్ని అనుకరిస్తే మరికొందరు ఆయన పాత్రలపేరుమార్చి తమ సొంతరచనలుగా చేశారు. తెలుగు సాహిత్యాన్ని, తెలుగు సాహిత్యాన్నేకాదు, భారత దేశంలోని వివిధ ప్రాంతీయ సాహిత్యాలను ఇంతగా ప్రభావితం చేసిన శరత్‌బాబు జీవిత చరిత్ర చాలామందికి తెలియదనడం అత్యుక్తికానేరదు. ప్రఖ్యాత నవలాకారుడుగా ఆయన సృష్టించిన పాత్రలను వాటి వెలుగు నీడలను తమ హృదయాలలో నిలుపుకున్న కారణాన వాటిని సృష్టించిన మహారచయిత తన జీవితంలో ఎదుర్కొన్న సమస్యలను, అలాంటి సజీవపాత్రల సృష్టికి ప్రేరేపించిన ఆయన మనస్తత్వాన్ని అర్థంచేసుకొనడానికి ఎంతోమంది ప్రయత్నించి వుండరు.

బెంగాలీభాషలో నవలా ప్రక్రియకు ఒరవడిదిద్దింది శ్రీ శరత్ చంద్ర ఛటర్జీకాదు, ఆ ఘనత బంకించంద్ర ఛటర్జీది. ఆయన వ్రాసిన 'ఆనందమఠం', 'కృష్ణకాంతుని మరణశాసనం' మొదలైనవి బెంగాలీ భాషలోనేకాక. దేశంలోని ఇతర భాషల వారికి కూడా సుపరిచితమైనవి. నిజానికి, మన జాతీయగీతం 'వందేమాతరం' కర్త బంకింబాబే అయినా, ఆ గేయాన్ని ఆయన ప్రత్యేకంగా వ్రాయలేదు. ఆయన వ్రాసిన 'ఆనందమఠం' లోనిది.

పోతే బెంగాలీ నవలకు అంతర్జాతీయఖ్యాతిని తెచ్చింది విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్. ఆయన వ్రాసిన 'గోరా', 'నౌకాభంగం', 'ఇంటా బయట' మొదలైనవి ఇతర భాషలలోకి కూడా అనువదింప బడ్డాయి. అయితే, ఈ

## తుర్లపాటి కుటుంబరావు

ముగ్గురు బెంగాలీ నవలాకారుల మధ్య ఎంతో తేడావుంది. బంకింబాబు బెంగాలీ నవలకు ఒరవడి పెట్టినవారేకాని ఆయన పాత వ్యవస్థను సమర్థించాడు. ఆయన రచనలలో 'కన్సర్వేటివ్' పోకడలు కానవచ్చాయి. ఆయన ఎంతవరకు వున్న వ్యవస్థనే సమర్థించాడు, ఆయన పాత్రలలో రెండే రెండురకాలు గోచరిస్తాయి. అవి అయితే దేవతలైనా కావాలి, కాకపోతే రాక్షసులైనా కావాలి. అంతేకాని వాటిలో మానవులు కనిపించరు. అంటే ఆయన పాత్రలలో కొన్ని ధర్మానికి, న్యాయానికి, మంచికి ప్రతీకలైతే, మరికొన్ని అధర్మానికి, అన్యాయానికి, చెడుకి, ప్రతిబింబాలు. అందువల్ల అవి కేవలం ఆదర్శవాదంతో కూడినట్టివి. కాబట్టి సహజంగా వాటిలో వాస్తవికత తక్కువ. సమకాలీన సమాజంలోని వ్యక్తులకు అవి దర్పణాలుకావు. వాస్తవికతను అవి చిత్రించలేకపోయాయి.

ఇక టాగూర్ పాత్రలు సాంఘికమైనవైనా వాటిలో కూడా వాస్తవికత తక్కువే. ఆయన పాత్రలు ఒక ప్రఖ్యాత ఆంధ్ర రచయిత అన్నట్టు. శాపవశాన దివి నుండి భువికి దిగి వచ్చిన గంధర్వుల్లా వుంటాయి. అందువల్ల అవి కూడా వాస్తవికతకు కొంచెం దూరంగానే వుంటాయి. పోతే టాగూర్ నవలలో కవితాసౌందర్యం అధికం. శిల్పానికి ఆయన అధిక ప్రాధాన్యమిచ్చారు. వర్ణనలకు ఆయన

విశేష ప్రాధాన్యమిచ్చారు. కాగా, శరత్ నవలలు వారిద్దరి వాటి కంటే భిన్నమైనవి, ఆయన పాత్రలు సజీవమైనవి. సమకాలీన పరిస్థితులకు అవి ప్రతిబింబాలు. సాధారణ మానవుని కష్టసుఖాలను, మనోవేదనలను, వికారాలను, వైకల్యాలను ఆయన చక్కగా చిత్రించారు. ముఖ్యంగా ఆయన సృష్టించిన స్త్రీ పాత్రలు సజీవమైనవి. సమాజంలో స్త్రీల సమస్యలను, వారి మానసిక సంఘర్షణలను, ఆయన చక్కగా చిత్రించారు. వితంతువుల మనోవేదనలను, పుట్టింటిలో వారు పడే యాతనలను ఆయన కళ్ళకు కట్టినట్టు చెప్పారు. స్త్రీహృదయాన్ని ఆయన విప్పి దానిలోని వైవిధ్యాలను, సంఘర్షణలను, మూగబాధలను ఆయన ప్రపంచం కళ్ళ ముందు వుంచారు. ఆయన నవలల్లో సన్నివేశాలు, సంఘటనలు హెచ్చు. ఒకే సన్నివేశంలో వేర్వేరు పాత్రల హృదయ స్పందన ఎలా వుంటుందో అతి సహజంగా చిత్రించడంలో కృతకృత్యులైనారు. అందువల్లనే ఆయన నవలలు ప్రజాసామాన్యాన్ని విశేషంగా ఆకర్షించాయి. బంకించంద్ర ఛటర్జీ నవలలు సమాజంలో కేవలం ధార్మిక భావాలు కన్సర్వేటివ్ దృష్టివున్న పాఠకులను హెచ్చుగా ఆకర్షిస్తే టాగూర్ నవలలు సమాజంలో సాంస్కృతిక స్థాయి కొంచెం అధికంగా వున్నవారిని అలరిస్తే శరత్‌బాబు నవలలు ప్రజాసామాన్యాన్ని ఆకట్టుకున్నాయి. అందువల్లనే వీరిద్దరి కంటే శరత్‌బాబు నవలా రచయితగా హెచ్చు ప్రాచుర్యాన్ని సంపాదించారు. ప్రజాబాహుళ్య హృదయాలలో తిరుగులేని స్థానాన్ని ఆక్రమించారు.

అయితే, టాగూర్ పట్ల శరత్‌బాబుకు విశేషమైన గౌరవప్రపత్తులు కలవు. ఆయన 'గోరా'ను శరత్ ఎన్ని సార్లు చదివాడో ఆయన శైలిని ఈయన హృద్గతం చేసుకున్నాడు. ఆయన పాత్రలను మననం చేసాడు. అయితేనేమి, వాటికి శరత్ మరి కొన్ని మెరుగులు దిద్దాడు. అందువల్లనే, ఏ తెలుగు రచయిత నవలలకైనా లేనీ ప్రాచుర్యం తెలుగులో శరత్ నవలలకు వుంది.

ఉదాహరణకు, శరత్ 'దేవదాసు'ను చూడండి. ప్రపంచ సాహిత్యంలో రోమియో, జూలియట్, లైలామజ్ను, సలీం, అనార్కలీల పాత్రల వలెనే, పారు, దేవదాసుల పాత్రలు అజరామరంగా నిలిచి పోతాయి. "దేవదాసు వంటి దిక్కుమాలిన చావు ఎవ్వరికీ కలుగకూడదు" అని ఆ నవలలో వున్న ఆఖరి వాక్యం వెనుక ఎంత గుండెబరువు, ఎంత ఆవేదన వున్నవో!

అలాగే 'చరిత్రహీనులు'లోని సావిత్రి, కిరణ్మయి, శరత్ పాత్రలు, 'బడదీది' లోని మాధవి, నరేన్ పాత్రలు, 'శ్రీకాంత్'లోని రాజ్యలక్ష్మి శ్రీకాంత్ పాత్రలను ఆయన నవలలు చదివిన పాఠకుడు తన జీవితంలో మరచిపోలేడు.

భారతీయ నవలా ప్రపంచంలో అపూర్వ విప్లవం తెచ్చిన శరత్‌బాబు 1876 సెప్టెంబరు 15వ తేదీన బెంగాల్‌లోని హుగ్లీ జిల్లాలో గల దేవానందపురమనే గ్రామంలో జన్మించాడు, శరత్‌బాబుకు రచనా వ్యాసంగం ఏదో మధ్యలో వచ్చిందికాదు. ఒక విధంగా పుట్టుకతో వచ్చిందనే చెప్పాలి. ఆయన తండ్రి మోతీలాల్ ఛటర్జీ నాటక, నవలా రచయిత. కాని, ఆయన వ్రాసిన నవలలు, నాటకాలు వెలుగుముఖం చూడలేదు. ఆయన వ్రాసినవన్నీ సగ సగం నవలలు; నాటకాలే. ఒక నాటకం మొదలుపెట్టి అది పూర్తి కాకుండానే ఆయన మరొక నవలను ఎత్తుకునే వాడు. ఏ ఉద్యోగంలో కుదురుకొనకుండా, ఇలా అరకొర వ్రాతలు వ్రాస్తుండేసరికి బంధుమిత్రులలో ఈసడింపు పెరిగింది. ఆయనను చాదస్తునికింద జమ కట్టారు. అయితే స్వతంత్ర ప్రవృత్తిగల మోతీలాల్‌వారి కువిమర్శలను ఖాతరు చేయలేదు.

ఇక శరత్ తల్లి భువనేశ్వరీదేవి సంస్కృతీ సంపన్నురాలు. ఆ దంపతులకు జన్మించిన తొమ్మిదిమందిలో [illegible] మగపిల్లలలో మొదటివాడు. చిన్నప్పుడు ఉబు[illegible]పోకకు తండ్రి వ్రాసిన అసంపూర్ణ నాటకాలను, నవలలను చదువుతుండేసరికి వాటిని ఎలాగైనా పరిపూర్తి చేయాలన్న ఆకాంక్ష ఆ బాల హృదయంలో కలిగింది. అప్పుడే ఆయనకు రచనా వ్యాసంగంపట్ల ఆసక్తి కలిగింది. పది సంవత్సరాల వయస్సులోనే ఆయన రచనలు ప్రారంభించాడు. శరత్ బాబు అర్భకుడు, మొదటినుంచి ఆరోగ్యం అంతమంచిది-కాదు. దానికితోడు నిలకడలేని ఉద్యోగాలవల్ల వచ్చే ఆదాయం అంతంతమాత్రం కావడంవల్ల దారిద్ర్యబాధ ఒకటి.

ఇలావుండగా, ఆ బాలునిలో ఆకస్మికంగా జ్ఞానోదయమైంది. విపరీతమైన విజ్ఞానతృష్ణ కలిగింది. కనిపించిన ప్రతి పుస్తకాన్ని ఆయన చదివేవాడు. క్లాసులో మంచి మార్కులు వచ్చేవి.

**నాటకాలలో ఆడవేషాలు :** అప్పుడే ఆయనకు నాటకాలపై కూడా ఆసక్తి కలిగింది. మిత్రులతో కలిసి ఆయన నాటకాలు వేసేవాడు. ఎర్రగా, సన్నగా, మధురమైన కంఠంకల శరత్ బాబు ఆడవేషాలువేసి, ప్రశంసలు పొందాడు. బహుశా స్త్రీల పట్ల ఆయనకు అంతర్గతంగా ఉన్న సానుభూతి ఆ రూపంలో వ్యక్తమైనదేమో! ఎట్టకేలకు 19వ యేట

ఆయన ఎంట్రన్స్ పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. పిమ్మట ఆయన కాలేజీలో ఎఫ్. ఏ. లో చేరాడు. ఆ సమయంలోనే ఆయన 'శిశువు' అనే లిఖిత పత్రికను ప్రారంభించాడు. ఆయన స్నేహితులు కొందరు "యమున" అనే పత్రికను స్థాపించి, దానికి ఒక కథ వ్రాయవలసిందిగా శరత్‌ను కోరగా, ఆయన వ్రాసిన మొదటి కథ మొత్తం బెంగాల్‌లోనే విశేషమైన సంచలనం కలిగించి, ప్రశంసలు తెచ్చుకొన్నది.

భాగల్పూర్‌లో కాలేజీ విద్యాభ్యాసం సమయంలో ఆయనకు విభూషణభట్టు అనే రచయితతో పరిచయం ఏర్పడినది. శ్రీభట్టు సోదరి నిరుపమాదేవి కూడా సాహిత్య ప్రియ. వీరు ముగ్గురు నిరంతరం సాహిత్య గోష్ఠులలో నిమగ్నులయ్యేవారు. ముగ్గురు నాటకాలు వేసేవారు. అయితే, ఇది శరత్ మేనమామకు నచ్చలేదు. ఆయన ఇంటి నించి శరత్‌ను వెళ్ళగొట్టారు. తనకు చదువు చెప్పించడానికి తండ్రికి తాహతులేదు. మేనమామ ఇంటిలో వుండి ఏదో విధంగా చదువుకుందామంటే, నాటకాలంటే గిట్టని ఆ సనాతనుడు ఇంటినుంచి వెళ్ళగొట్టాడు. ఇక ఏమి చెయ్యాలి? చదువుకు తప్పనిసరిగా స్వస్తి చెప్పి, పొట్టకూటి కోసం ఉద్యోగం చేయవలసి వచ్చింది. ఒక జమీందారు దగ్గర నౌఖరీకి కుదిరాడు. కాని, ఆ జమీందారుతోపాటు వేటాడవలసి వచ్చేసరికి మృదుహృదయుడైన శరత్‌బాబుకు నిష్కారణంగా జీవహింస చేయడం నచ్చలేదు. అందువల్ల, ఆ ఉద్యోగానికి స్వస్తిచెప్పాడు. ఇక గత్యంతరంలేక జీవితంపై విరక్తి కలిగిన శరత్ సన్యాసం తీసుకొని దేశాటనకు బయలుదేరాడు.

నెహ్రూ, తిలక్ మొదలైనవారికి జైలు జీవితం గ్రంధరచనకు తోడ్పడినట్టే ఈ దేశాటన విభిన్న మానవ మనస్తత్వ పరిశోధనకు, ప్రజల కష్టసుఖాలను స్వయంగా గమనించడానికి శరత్‌బాబుకు ఎంతో తోడ్పడింది. ఆయన చాలా కాలం ముజఫర్‌పూర్‌లోని సత్రంలో వుంటూ కాలం గడిపాడు. ఆయన శ్రావ్యమైన కంఠంతోపాడే పాటలు, ఆయన భాషాజ్ఞానం ప్రజలను విశేషంగా ఆకర్షించేవి. నివురుగప్పిన నిప్పు వలె వున్న ఈ యువ సన్యాసి ఒకనాటికి గొప్పవాడు కాగలడని ఆయనను చూచిన వారు, ఆయన మాటలు విన్నవారు భావించేవారట. సాహిత్యప్రియులు పెక్కుమంది ఆయనవద్దకు వచ్చి ఆయనతో సాహిత్యగోష్ఠి జరిపేవారు. ఇలావుండగా, 1930లో తండ్రి పోయినట్టు అకస్మాత్తుగా పిడుగులాంటి వార్త వచ్చింది. కుటుంబానికి పెద్ద కొడుకు. తప్పనిసరిగా వెళ్లి తండ్రి కర్మ జరపాలి. శరత్‌బాబు ఇంటికి వెళ్ళి తండ్రి కర్మ జరిపాడు. ఇక భవిష్యత్తు ఏమిటి? పోయినవారు పోగా, ఇద్దరు సోదరులు, ఇద్దరు సోదరీమణులున్నారు. తల్లి తన తొమ్మిదవయేటనే మరణించింది. కుటుంబ పోషణభారం శరత్‌చంద్రునిపై పడింది. ఆయన పెద్ద సోదరునికి ఎక్కడో ఉద్యోగమిప్పించారు. సోదరీమణులను బంధువులకు అప్పగించాడు. తాను 'ఉదర నిమిత్తం బహుకృతవేషం'అన్నట్లు ఒక ప్లీడరు వద్ద గుమాస్తాగా చేరాడు. ఆంధ్రకేసరి కావలసివున్న ప్రకాశం సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో గుమాస్తాగా ఎలా యిముడుతాడు? అలాగే ఇంతటి మహా రచయిత కావలసిన శరత్‌బాబు ప్లీడరు గుమాస్తా ఉద్యోగం ఎలా చేస్తాడు? త్వరలోనే దానికి కూడా స్వస్తి చెప్పాడు. కిమపి కర్తవ్యమ్?

అకస్మాత్తుగా ఒక ఆలోచన తట్టింది. తాను కనక ఎంట్రన్స్ పరీక్షప్యాసయి బర్మావస్తే ప్లీడర్ చదివిస్తానని చిన్నప్పుడు వాగ్దానంచేసిన పినతల్లి [illegible] అఘోర్‌బాబు జ్ఞాపకంవచ్చి, శరత్‌బాబు స్వదేశాన్ని విడి. రంగూన్ ప్రయాణం కట్టాడు. కాని, ఏదో ఒక సామెత చెప్పినట్లు శరత్‌కంటె ముందు పెద్దమ్మవారు రం[illegible] వెళ్ళినట్లున్నది. శరత్ రంగూ[illegible] [illegible]క్‌బాబు గుటు[illegible]క్కుమన్నాడు.

ఊరుకానివ్[illegible] రం[illegible] [illegible] తానేమి చేయగలడు? 'సన్యాసి సుఖీ' అన్న[illegible] తిరిగి [illegible] కాషాయంబరాలు ధరించి ఉత్తర బర్మాలో కాలం వెళ్ళబుచ్చసాగాడు. అప్పుడే ఆయన బర్మీస్ భాషనుకూడా నేర్చుకొన్నాడు. 1905లో శరత్ రంగూన్ తిరిగి వచ్చాడు. అక్కడ మహేంద్రమిత్రా అనే ఒక బెంగాలీ వున్నాడు. ఆయన బర్మీస్ ప్రభుత్వంలో ఉన్నతోద్యోగి. ఆయన బాగా చదువుకున్నవాడు.

స్మి

"స్పృహయాళురుగ్రః పరుషో పదాన్యః
క్రోధం బిభ్రన్మనసా వైవికత్థీ
నృశంస ధర్మా షడిమేజనావై
పాప్యాప్యర్థం నోత సభాజయంతే"

*ఓ రాజా! ఆశగలవాడు, నిర్దయుడు, కఠిన వాక్కు గలవాడు, బహుభాషి క్రోధనుడు, ఆత్మశ్లాఘి - క్రూర ధర్ములైన ఈ ఆరుగురు మనుష్యులు, తాము ఎవరిచేత ఉపకారాన్ని పొందుతారో, వారిని కూడా ఆదరింపరు.*

\- తెనుగుసేత 'శాంతిశ్రీ'

సహృదయుడు. శరత్ సంగీత సాహిత్యాలు ఆయనను ఆకర్షించాయి. ఆయన శరత్‌కు తన వద్ద నెలకు ముప్పది రూపాయల జీతంలో గుమాస్తాగా వుద్యోగమిచ్చాడు.

ఆ సమయంలోనే ఆయనకు విచిత్రమైన పరిస్థితులలో భార్య లభించింది. ఒకరోజు ఆయన ఇంటిలో వుండగా, ఒక యువతివచ్చి ఆదుర్దాగా తలుపులు తట్టింది. తలుపులు తెరచి, ఏమిటని అడిగితే తాను అక్కడ పైభాగంలో వుండే శ్రీ చక్రవర్తి అనే ఆయన కుమార్తెనని, తన తండ్రి ధనాన్ని ఆశించి తనను ఒక ముదుసలికిచ్చి వివాహం చేయటానికి సిద్ధపడ్డాడని, అది యిష్టంలేక తాను పారిపోయివచ్చానని, ఆశ్రయమివ్వాలని కోరింది. ఆమె స్థితి చూచి జాలిపడిన శరత్ ఆమెను భార్యగా స్వీకరించాడు. వారిద్దరికి ఒక కుమారుడు కలిగాడు. కాని, వారిద్దరు ప్లేగు వ్యాధికి బలికావడంతో శరత్ తిరిగి ఒంటరి వాడయ్యాడు. భార్యాబిడ్డలను కోల్పోవడంతో ఆయన ఆ విపత్తుకు తట్టుకోలేకపోయాడు.

**రెండవ వివాహం :** తరువాత ఒకసారి రంగూన్ నుంచి ఇండియా వచ్చినప్పుడు ఆయన హిరణ్మయి అనే ఒక పేద యువతిని వివాహం చేసుకున్నాడు. ఆమెతో రంగూన్ వెళ్ళి, ఊరి చివర ప్రకృతి సౌందర్యం వుట్టిపడే ప్రాంతంలో చక్కని గృహంలో తన నివాసం ఏర్పాటు చేసుకున్నాడు.

ఆయన ఎప్పుడో వ్రాసిన "బడదీది" ఒక ప్రసిద్ధ బెంగాలీ పత్రికలో ప్రచురించబడింది. దానికి అమితమైన ప్రశంసలు వచ్చాయి. దానితో ఆయనను రచనలు చేయవలసిందిగా బంధుమిత్రులు ప్రేరేపించారు. అదే సమయంలో ఆయన గృహం దగ్ధమై ఆయన రచనలు నాశనమైపోవడం ఆయనకు హృదయవేదన కలిగించింది. ఈ సంఘటనే ఆయన 'గృహదహనం' నవలకు మూలమై ఉంటుంది. ఆ తరువాత ఆయనలో రచనలపట్ల పట్టుదల కలిగి, పుంఖాను పుంఖంగా నవలలు రచించారు. తన నవలకు కావలసిన ప్లాటులను సిద్ధం చేసుకోవడానికి ఆయన విపరీతంగా ఆలోచించేవాడు. రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టేదికాదు. అందువల్ల, ఆయన ఆరోగ్యం చెడిపోయింది. ఆయనకు ఇండియా వెళ్ళిపోదామనే కోర్కెకలిగింది. ఆ సమయంలో కలకత్తాలోని ఒక పత్రిక నెలకు నూరు రూపాయల జీతంపై ఆయనకు ఉద్యోగ మివ్వగలమని తెలిపింది. రంగూన్‌లో నెలకు ఏ నలభయ్యో, ఏభయ్యో రూపాయల జీతంతో కాలం వెళ్ళబుచ్చుతున్న శరత్‌కు ఇది పెన్నిధివలె కనిపించింది. ఔను, మరీ! విదేశంలో 50 రూపాయల ఉద్యోగికి ఒక్కసారిగా స్వదేశంలో రెట్టింపు జీతంపై ఉద్యోగం దొరకడం పేదకు పెన్నిధి దొరికినట్లేకదా!

శరత్‌బాబు తిరిగి కలకత్తా వచ్చాడు. అసంఖ్యాకమైన కథలు, నవలలు రచించాడు. ఆయన ఆదాయం విపరీతంగా పెరిగిపోయింది. ఆరోగ్యం మాత్రం విపరీతంగా క్షీణించింది. ఆయన కలకత్తాలో ఒక్క చక్కని భవనాన్ని, దానికి సమీపం లోని పల్లెలో మరొక భవనాన్ని నిర్మించాడు.

ఆయన సతీమణి హిరణ్మయి సౌందర్యవతి. ఆమె సౌందర్యం ఆయన రచనా వ్యాసాంగానికి ఉత్తేజం కలిగించేదిట. ఆయనను చూడ్డానికి దేశవిదేశాల నుంచి వచ్చే అతిధులను ఆమె విసుక్కోకుండా ఎంతో మర్యాదగా, ఆప్యాయతతో చూసేదిట. తనకు అన్నివిధాల చేదోడు వాదోడుగా వుండే సతీమణి లభించడం శరత్ అదృష్టమనే చెప్పాలి. అందువల్లనే ఆయన జీవితం రచయితగా ఎంతో రాణించింది.

కలకత్తాలో శరత్‌బాబు కీర్తి చంద్రికలు నాలుగువైపులా వ్యాపించాయి. ఆయనకు అఖండసన్మానాలు, అసంఖ్యాకంగా జరిగాయి. 1923లో ఆయనకు ఉత్తమ సాహిత్య నిర్మాతగా కలకత్తా యూనివర్శిటీ 'బగత్తారాణి'పతకం లభించింది. 1936లో ఢాకా యూనివర్శిటీ ఆయనకు 'సాహిత్యాచార్య' అనే బిరుదు ప్రసాదించింది. 'శరత్ వందన్' అనే పేరిట బెంగాలీ ప్రజలు ఆయనకు బ్రహ్మాండమైన సన్మానం చేశారు. శరత్‌బాబు భారతీయ సాహిత్యంలో చెరిగిపోని, శాశ్వతమైన స్థానాన్ని సంపాదించాడు. ఆయన తన అసంఖ్యాక నవలలలో ఉత్తమ పాత్రలను, దుష్ట పాత్రలను సృష్టించాడు. సహృదయులైన భార్యలను, ఉత్తములైన భర్తలను, అత్తలను బాధించే కోడళ్ళను, కోడంటికం పెట్టే అత్తలను, త్రాగుబోతు లను, తిరుగుబోతులను, లోభులను, ఉదారులను, పరార్థం కోసం స్వార్థాన్ని త్యాగంచేసేవారిని, స్వార్థం కోసం పరార్థాన్ని బలిపెట్టేవారిని చిత్రించాడు. ముఖ్యంగా వివిధ దేశాలలో, విభిన్న పరిస్థితులలో మనస్తత్వ చిత్రణలోనేమి, స్త్రీ హృదయస్పందన గ్రహణశక్తిలోనేమి తనకు తానే సాటి అనిపించుకున్నాడు. అందువల్లనే, అసంఖ్యాక భారతీయ మహిళా పాఠకలోకం ఆయనను తమ గురువుగా, తమ మార్గదర్శిగా, తమ రక్షకుడుగా పరిగణిస్తారు, పూజిస్తారు.

అయితే దురదృష్టవశాత్తు అనారోగ్యంతో బాధపడి, ఆయన 1938 సం॥ జనవరి 16వ తేదీన శాశ్వతంగా కన్ను మూశారు. అప్పటికి ఆయన వయస్సు 62 సం॥లు. ☆

# అనృత పుత్రులం కాకూడదు! అమృత పుత్రులం కావాలి!

"దైవాధీనం జగత్సర్వం , సత్యాధీనంతు దైవతమ్,
తత్సత్యముత్తమాధీనం, ఉత్తమో మమ దేవతా"

ఈ విశ్వమంతయూ దైవాధీనమై ఉంటున్నది. అట్టి దైవము సత్యాధీనమై ఉంటాడు. సత్యము ఉత్తముని యొక్క ఆధీనమై ఉంటుంది. అట్టి ఉత్తములే దైవ స్వరూపులు.

ప్రేమస్వరూపులారా! ఒకే వ్యక్తి జాగ్రత్తావస్థ యందు అనేక విధములైన అవస్థలకు గురిఅవుతుంటాడు. అదే వ్యక్తి స్వప్నమునందు తనను తానే కల్పించుకుంటాడు. తన భావములను కూడా కల్పించుకుంటాడు. తన సుఖ దుఃఖములనుకూడా కల్పించుకుంటాడు. అన్నింటియందును సుఖసంతోషములను అనుభవిస్తుంటాడు. నిద్రావస్థ యందు, సర్వమునూ మరచి, పరిపూర్ణమైన చైతన్యము నందు తల్లీనమై ఉంటాడు. ఒకే వ్యక్తి జాగ్రత్త, స్వప్న, సుషిప్తులయందు, విభిన్నమైన అవస్థలకు గురిఅవుతూ, వివిధమైన కర్మలకు తాను కట్టుబడి ఉంటాడు. కాని నిత్య సత్యమైన ఆత్మతత్త్వమును మాత్రం ఎవరూ కదిలించలేరు. ఒక కాగితమందు చిత్రించబడిన పూలమాలలను, ఎటువంటి పెనుగాలియైనా కదిలించలేదు. కాని తమను కదిలించును గాని, కాగితమునందు చిత్రించ బడిన దానినిమాత్రం, ఎటువంటి పెనుగాలియైనా కదిలించలేదు. బయట వాతావరణము, భక్తుల సంకల్పములను అనేక విధములు మార్పు చేయవచ్చును. కాని హృదయంలో నాటుకొనిపోయిన దివ్యత్వాన్ని మాత్రం చలింపజేయలేవు. కనుకనే సాధకుడు **చలించని మనసును, భ్రమించని దృష్టిని కలిగి ఉండాలి.**

మానవుని యొక్క శరీరము ఒక వెదురు కర్ర వంటిది. ఈ వెదురు కర్రకు అనేక గణుపులు ఉంటాయి. ఆ గణుపులే కామ, క్రోధ, లోభ, మోహ మద మాత్సర్యములు. మానవుని యొక్క దేహమును '**తుంగభద్ర**' అని పిలుస్తూ వచ్చారు. అది నది కాదు. ఈ తుంగభద్రకును, మానవుని యొక్క శరీరమునకు వుండినటువంటి సంబంధబాంధవ్య మేమిటి? '**భద్రము**' అనగా కళ్యాణము, మంగళకరము. 'తుంగ' అనగా అమితమైన. '**తుంగభద్ర**' అనగా అమితమైనటువంటి ఆనందమును, మంగళమును, కళ్యాణమును చేకూర్చేటటువంటిది. అదే ఈమానవశరీరము. అట్టి దివ్యమైన, భవ్యమైన, పవిత్రమైనటువంటి ఈ మానవ దేహమును మనం ఏ విధమైన మార్గంలో వినియోగిస్తున్నామో, ఎవరికి వారు ఆలోచించాలి. మంగళకరమైన, పవిత్రమైన, కళ్యాణకరమైన ఈ దేహమును ఎట్టి తుచ్ఛమైన మార్గంలో మనం వినియోగపరుస్తున్నామో. ఎవరికి వారు యోచించాలి. అనేక విధముల పరిశీలించి, పరిశోధించి, ఈ దేహమునకు '**తుంగభద్ర**' అని నారదుడు పేరు పెట్టాడు.

## భగవాన్ సాయి హితబోధ

'నారదుడు' అనగా కేవలం కలహప్రియుడని భావిస్తుంటారు లోకులు. కాదు... కాదు... ఇది కేవలం లోకుల భ్రాంతి. సమస్త దుఃఖములను పరిహారంగావించి, జ్ఞానమును అందించేటటువంటి మహానుభావుడే నారదుడు. జ్ఞానభాస్కరుడే నారదుడు. అట్టి త్రికాల భాజ్యుడైనటువంటి నారదుడు, విష్ణుప్రియుడైనటువంటి నారదుడు, ఈ నూతనమైన పేరును కలిపించాడు. అదియే '**తుంగభద్ర**'. ఇట్టి పవిత్రమైన నామమును సరియైన అర్థమును గుర్తించి, సత్క్రమమైన మార్గంలో వినియోగించి, ఆనందించడానికి తగిన కృషి చేయాలి.

మానవత్వమునకు కేవలం లౌకికమైన, భౌతికమైన, ప్రాకృతమైన అర్థములనే మనం తీసుకొనకూడదు. ప్రాచీన ఋషులు తమ అనుభూతులలో దర్శించనటువంటి రూపాలను ఈ మానవత్వానికి నామములుగా నియమించారు. కాని ఇట్టి పవిత్రమైన నామములను సమాజంలో సరియైన రీతిలో వినియోగించుకోలేకపోవటంచేతనే, అనేక విధములైన దుఃఖములకు గురిఅవుతూవస్తున్నాం. ఈనాటి మానవుడు సమాజస్థితిని ఏ మాత్రం గమనించటంలేదు. వ్యక్తిగతమైన, కుటుంబసంబంధమైన స్థితిగతులను మాత్రమే విచారణ చేస్తున్నాడు.

ప్రేమస్వరూపులారా! జీవితం చాలా విలువైనటువంటిది. మానవత్వం అత్యంత ఉత్తమమైనది. **'జంతూనాం నరజన్మదుర్లభం'** అన్నారు. ముఖ్యంగా ' నర' శబ్దమునకు అంతరార్ధం తెలుసుకోవాలి. 'న' అనగా కాదు. 'ర' అనగా మృత్యువు. నాశనము కానటువంటితత్త్వమునకే 'నర' అని పేరు. 'నరుడు' అనగా నాశనం కానటువంటివాడు. నర, నారద, నారాయణి-ఈమూడు పదముల అంతరార్ధమును తెలుసుకుంటే, ఈ మూడుఒక్కటేఅనితెలుస్తుంది. నరునకు, నారాయణుని చూపించినటువంటివాడే నారదుడు. 'నర' తత్త్వమునకు ఎంతటి ఉత్తమమైన అర్ధములో ఉంటున్నాయి. ఇలాంటి 'నర' మానవత్వాన్ని దుర్వినియోగపరుచుకుంటున్నందుకు విచారించాలి. నరునికంటే దైవం వేరొకడుకాదు. దైవం తనకంటే భిన్నంగా లేడు. తనకన్నా భిన్నంగా లేనటువంటివాడు కనుకనే, భగవంతుని పూజించనవసరం లేదన్నాడు నారదుడు. నరుడే నారాయణుడు. నరుని యందు నారాయణుని చూడటమే నిజమైనటువంటి మంచితనం. నారాయణుని యందు నరత్వమును వహించటమే గొప్పతనం. కాని మనం 'గొప్పవాడు'కావాలని ఆశిస్తున్నాం. **గొప్పవాని కంటే మంచివాడు చాలా ఉత్తముడు.** ప్రతి నరుని యందు నారాయుణుని చూస్తుంటాడు మంచివాడు. కాని నారాయణునీ యందు కూడనూ నరుని చూస్తూ వస్తుంటాడు చెడ్డవాడు. అతనే రావణుడు. నారాయణుని యందు నరుని చూస్తూ వచ్చాడు రావణుడు. కాని నారదుడు నరునియందు నారాయణుని చూస్తూ వచ్చాడు. కనుక ప్రతి వ్యక్తిత్వమునందునూ, దివ్యమైనటువంటి శక్తిత్వం యిమిడి వుంటుందనే సత్యాన్ని గుర్తించాలి. ఐకమత్యంచేత అనేక రకములైన ఆనందమును పొందవచ్చును. ఏకత్వం చేతనే అనేక సుఖములను పొంద వచ్చును. భిన్నత్వం చేత మనం పొందవలసిన ఆనందానికి కూడా దూరమై పోతున్నాం. రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు ఐకమత్యంగా ఉండటం చేతనే వారి కీర్తి జగత్ వ్యాప్తి అయింది. వాలి సుగ్రీవులు అన్నదమ్ములే. కాని వారిలో భిన్నత్వం వుండటం వలన ఎన్నోవిధములైన కష్టములకు గురి అయినారు. ధర్మజుని ఆజ్ఞలను శిరసావహించి నడచుకోవటం వలన పాండవులు ఘనతను పొందారు. భిన్నత్వంచేత, ద్వేషంచేత, ఐకమత్యమును కోల్పోవటం చేత ఎన్నియో దుఃఖములకు గురిఅవుతున్నారు. ఐకమత్యమును అభివృద్ధి గావించుకోవటముచేత సర్వ సుఖములనూ పొంద గలుగుతున్నారు. మహనీయుల చరిత్రలు భావితరాలకు అనేక విధములైన ఆదర్శములను అందిస్తూ వస్తున్నాయి.

మానవుడిని **'అమృతస్యపుత్రః'** అన్నారు. **'అమృత పుత్రుడు'** మానవుడు ఈ నిజతత్త్వాన్ని గుర్తించుకొనలేక **'అనృత పుత్రుడు'**గా మారిపోతున్నాడు. కాని మనం అనృత **పుత్రులం కాకూడదు, అమృత పుత్రులమే కావాలి.** మనం **దైవాంశసంభూతులం కాకూడదు. దైవములమేకావాలి** మనలో **ఉండవలసినది ప్రేమాంశముకాదు, ప్రేమయే** మనం అభివృద్ధి **పరచుకోవాలి.** ఇట్టి ప్రేమ తత్త్వాన్ని మనం అనుభవించి నప్పుడే, పరమాత్మతత్త్వమును మనం సులభంగా గాంచవచ్చును.

పరమాత్మ ఎక్కడున్నాడు? తనకంటే వేరుగా వున్నాడనే భావం వుండినంతవరకూ, పరమాత్మ అత్యంత దూరంగా వుంటాడు. పరమాత్ముడు సన్నిహిత సంబంధుడు. అతని స్నేహమే నా యొక్క నిజమైన స్నేహము"అని ఇద్దరి యొక్క ఏకత్వాన్ని గుర్తించినప్పుడు, నీకు, నీవు ఎంత దగ్గరో, పరమాత్మ కూడా అంత దగ్గరవుతుంటాడు. భగవంతుడు ఏ దేవాలయమునందో, ఏ పుణ్యక్షేత్రములోనో, ఏ పుణ్య తీర్థమందో వుంటున్నాడని భావించటం చాలా పొరపాటు.

ప్రప్రథమంలో అక్షరాలు నేర్చుకోవాలి. A,B,C,D,E అనే అక్షరాలు నేర్చుకున్నప్పుడే, తరువాత G O D(గాడ్)

అనే పదాన్ని మనం నేర్చుకోవచ్చును. ఈ పదములు నేర్చుకొనిన తరువాతనే, వాక్యములను మనం చదువవచ్చును. వాక్యములు చదవటం వస్తే పుస్తకాలే మన హస్తగతమై పోతాయి. కనుకనే ప్రాచీన కాలము నుండి పామరులైన మానవులకు, ఇది దేవాలయమని, ఇది భగవంతుని పుణ్యక్షేత్రమని, తీర్థమని చెబుతూ వచ్చారు. అక్షరాలు నేర్పుతున్నట్లు నేర్పుతూ వచ్చారు. ఇవన్నీ పామరుల మనసులలో పవిత్రమైన భావాలు చేర్చడం కోసం ఇటువంటి అభ్యాసములు చేస్తూ వచ్చారు. భగవంతుని యొక్క తత్త్వమునకు ఎట్టి అభ్యంతరములూ వుండవు. భగవంతుని యొక్క శక్తిసామర్థ్యములకు ఎట్టి ఆటంకములూ అడ్డురావు. కాన ప్రతి మానవుడు, ఈ చిన్నచిన్న విషయాలయందే దైవత్వాన్ని గుర్తించడానికి ప్రయత్నించాలి.

మన సాయినాథ్ చెప్పాడు. స్వామి చెప్పే చిన్నచిన్న విషయాలలో కూడా ఎంతో అంతరార్థముంటుందన్నాడు. వీరు కొన్ని అనుభూతులు కూడా పొందారు. ఈ దేహము నివసించేటటువంటి పూర్ణచంద్ర ఆడిటోరియం (పుట్టపర్తి) పైన, సాయినాథ్, దిలీప్, సత్యజిత్, అనంతపాట్లె శ్రీనివాస్‌లు ద్వారం ముందు పడుకొనేటటువంటివారు. ఏ చిన్నవిషయం జరిగినా చక్కగా గుర్తించేవారు. అప్పుడప్పుడు మరణించినవారుకూడనూ, నన్ను దర్శించడానికి వస్తుంటారు. చాలా సంవత్సరాలక్రిందట మరణించినవారు కూడనూ నన్ను చూడటానికి వస్తుంటారు. పగలు కూడా వస్తుంటారు. కాని వీరు చూచింది రాత్రి సమయంలో మాత్రమే. ఒకరోజు ఉదయం భజన అయిన తరువాత పైకిపోయాను. ఈ శరీరమునకు తల్లి అయిన ఈశ్వరమ్మ వచ్చి అక్కడ కూర్చుంది. 'ఎందుకు వచ్చావు? ఇతరులు చూస్తే ఏ విధంగా భావిస్తారు?; ఇట్లా రావద్దు' అన్నాను. "స్వామీ! ఇది మాతృహృదయము. నీకేం తెలుసు. మీరు మాతృభావనతో వున్నప్పుడు మీకుతెలుస్తుంది. నేను మాతృభావనతో ఉన్నాను. మీరు దైవభావంతో ఉన్నారు. దైవభావానికి, మాతృభావం అర్థంకాదు. మాతృభావానికి దైవభావం అర్థం కాదు. మిమ్మలనుచూచి, ఒక చిన్నవిషయాన్ని చెప్పిపోదామని వచ్చాను" అన్నది. ఏమిటి చెప్పు? నేను వినిపోవాలన్నాను. "స్వామీ! ఎప్పుడూ తొందరపడితే ఎట్లా? కొంచెం శాంతంగా మాట్లాడండి" అన్నది. 'స్వామీ! ఈనాడు లోకపరిస్థితులు సరియైన స్థితిలోలేవు. ప్రపంచంలోని మనుషులందరూ ఏదో ఒక దురవస్థలతో, దురాలోచనలతో ఉంటున్నారు. అందరూ ప్రేమతో వస్తున్నారని మీరు భావిస్తున్నారు. మీ భావములకు అది సహజమే. కాని నా భావములకు అది సహజంకాదు. మీరు జనంలోనికి వెళ్ళినప్పుడు కొందరు చేతిరుమాలా మీకు అందిస్తుంటారు. కాని దానిని చూచినప్పుడు నాకు చాలా భయం వేస్తుంది. కనుక నేటి నుంచి, ఎవరూ మీకు సన్నిహితులుగా వుంటారో, వారిచ్చిన చేతిరుమాలనే తీసుకోండి. ఇంక ఎవరిచ్చినా తీసుకోకండి!' అన్నది. తరువాత నేను అడిగాను. ఎందుకోసం ఆ విధంగా చెబుతున్నావన్నాను? 'స్వామీ! నీకు లోకమంతా సమానమే. అందరూ నీకు సమానులే అయినప్పటికినీ, కొందరి హృదయాలు పాషాణంగా ఉంటుంటాయి. ఆ చేతిరుమాల లోపం కొంచెం పాషాణం పెట్టి నీకు అందిస్తుంటారు. దానిని మీ మూతికి తుడుచుకున్నప్పుడు మీకు నాలుకకు అంటుతుంది. చాలా ప్రమాదం అవుతుంది. కనుక ఇలాంటివి మీరు ముట్టకండి" అన్నది. 'సరే! నీ తృప్తి కోసం నేను ముట్టనులే' అని చెప్పాను.

కొన్ని దినములు అయిన తరువాత ఒక రోజు రాత్రి పడుకున్నాను. కొందరు పిల్లలు అటూ, ఇటూ పడుకున్నారు.

"చింత చెట్టును కల్పతరువుగా భావించి
కామితంబులు తీర్చు కరుణాలవాల
చిత్రావతీయిసుక కందచక్కెరజేసి
ప్రసాదమిడినట్టి మధురమూర్తి
కంఠమందున నీలకంఠునే సృజియించి
శిష్టజనులకు నిచ్చు శుశ్రేష్టమూర్తి
నీదు మహిమల నెంచ మేమెంతవారము
ఆదిశేషునకైన అలవియగునె

కర్మవిపాకంబు కలుగనంతవఱకు
నీదుమహిమలు గురుతింపనేరరయ్య
అంధుడెట్లు చూచు అర్కునితేజంబు
అజ్ఞులట్టులుందురవనిలోన

పుట్టపర్తిని వెలసిన పుణ్యపురుష
పట్టుకుంటిమి నీదు చరణాబ్జములను
నెట్టి వేసెద సకల సంపదలన్నియు
ఎట్లు బ్రోతువో సత్యసాయిరామా"

- చామర్తి విజయలక్ష్మి, శ్రీకాకుళం

ఆనాడు సాయినాథ్, సత్యజిత్, శ్రీనివాస్ వగయిరాలు అందరూవున్నారు. రాత్రి ఒక గంటఅయింది. నేను స్నానాల గదిలోనికి వెళ్ళేటప్పటికి మాట్లాడుతున్నది గట్టిగా ఈశ్వరమ్మ. నేను చెప్పాను. 'నోరు మూసుకో! గట్టిగా మాట్లాడకు. పిల్లలు నిద్రపోతున్నారు. వాళ్ళు లేస్తారు. నీ విషయం వారికి తెలుస్తుంది. పెద్దగా మాట్లాడవద్దు' అన్నాను. మీరంటే నాకు భయంగాని, నాకు ఎవరైనా భయం లేదన్నది. నేను ఎవరికీ భయపడను. నేను ఏతప్పు చేయ లేదు. తప్పు చేసినవానికి భయంవుంటుందికాని తప్పు చేయని నాకెందుకు భయం? పుత్ర వాత్సల్యంతో వస్తున్నాను కాని, మరొక భావంకాదు' అన్నది. 'పోనీ వచ్చినావు. ఏం కారణం?' అన్నాను. స్వామీ! నిన్నటి దినం పండుగ, క్రొత్త అంగీ ధరించారు. అది పెద్దదిగా కనిపిస్తుందని అందరినీ బెల్టులు అడిగావు (పిల్లలందరినీ అడిగినమాట వాస్తవమే). ఈ విధంగా వారిని, వీరిని అడిగేదెందుకు? నా ప్రాణం పోయేముందు మిమ్ములను పిలిచాను. (స్వామీ! స్వామీ! అని ఇక్కడనే బృందావనంలోనే పిలిచింది). ఆ ముందు రోజే, ఆమెకు ప్రీతి అని పెద్ద చైన్ తీసి ఆమె మెడలో వేశాను. తిరిగి ఆ కళేబరాన్ని పంపించే ముందు, రామ బ్రహ్మంతో చెప్పాను. ఆమెకు ఈ చైన్ (గొలుసు) చాలా ఇష్టం. ఆమెను పూడ్చే సమయంలో ఈ గొలుసును మాత్రం తీయకండి. ఆమెతోనే ఉండనీయండన్నాను. అప్పుడు ఆమె మెడలోనే ఉన్నది. ఆ రాత్రి పూర్ణచంద్రకు వచ్చినప్పుడు ఆ గొలుసు తెచ్చి యిచ్చింది. అక్కడ నావద్ద పడుకున్న పిల్లలులేచి, తలుపు వద్దకు వచ్చి నుంచున్నారు. తిరిగి బయటకు వచ్చేటప్పటికి అందరూ నమస్కారం చేస్తూ నిలుచున్నారు. మీరెందుకువచ్చారు? నే పిలువలేదే అన్నాను. మాటలువిని, ఈ అర్ధరాత్రి ఈ గదిలోనికి ఎవరు వచ్చారా? అని చాలా భయపడి వచ్చామన్నారు. అప్పుడు చెప్పాను. ఈమె ఈ శరీరమునకు తల్లి. మీరెవరూ చూడలేదు. మీరందరూ 20....22 సంవత్సరములవారు. ఆమె ఈ శరీరమును వదలిపెట్టి 30 సంవత్సరములపైన అయిందన్ని చెప్పి, ఈశ్వరమ్మ యిచ్చిన గొలుసును వారికి చూపించాను. ఇప్పటికీ వారివద్దనే వున్నది ఆ గొలుసు. ఈ విధంగా ప్రతి చిన్న విషయాన్ని జాగ్రత్తగా వాళ్ళు గ్రహించేవారు. కాని మంచిపిల్లలు. అలాంటి మంచి పిల్లలనే నా దగ్గర పెట్టుకుంటాను.

ఒక దినం సిమ్లా దగ్గర ఒక స్త్రీకి గుండెపోటు వచ్చింది. ఆమెకు ఇద్దరు పిల్లలున్నారు. భర్తలేడు. ఆమె చాలా బాధ పడుతున్నది. అప్పుడు రాత్రి 2 గంటలకు ఈ దేహమును వదిలాను. వస్తూ.... వస్తూ.... దేహమును వదిలేటప్పటికి క్రింద పడిపోయాను. ఈ దేహంలో ఏమాత్రం ప్రాణం లేదు. పడేటప్పటికి, క్రింద మార్బుల్స్ వేసారుగదా! తల పడింది. పిల్లలందరూ వచ్చారు, పట్టుకున్నారు, లేపినారు. ఏమి మాట్లాడించినా నేను కదలలేదు, మెదలలేదు. తలకే మైనా దెబ్బ తగిలిందేమోనని, తల ఎత్తడానికి ప్రయత్నం చేశారు. ఎవరికీ చేతకాలేదు. ఇంత బలమైనటు వంటి పిల్లలు, నా చిన్నతలను కూడా ఎత్తలేకపోయారు. తరువాత టవల్సు తీసుకొని వచ్చారు. ఎక్కడైనా దెబ్బ తలిగిందేమో నని, రక్తం కారుతున్నదేమోనని, ఎక్కడా ఏమీ వారికి కనిపించలేదు. నా Bed Room లో నేను ఎప్పుడూ లైట్లు వేసుకుంటాను. చీకట్లో పడుకోవటం నాకు ఇష్టం లేదు. చీకటిని రాక్షసులు ఆశిస్తారు. నేను ఎప్పుడును వెలుగు (Light) నే ఆశిస్తాను. ఈ విధంగా కొన్ని కొన్ని పరిస్థితులలో నా వద్దవున్న పిల్లలు చాలాచాలా అనుభూతు లను పొందారు.

కొన్ని కొన్ని దివ్యానుభూతులు ఎవరికీ చెప్పడానికి వీలుకాదు. దైవత్వం మనుషులకంటే వేరుగాలేదు. I and You are One అని చెప్పారు. "One" అని చెప్పటం కూడా బాగుండదు. నీవు, నేను వేరువేరు కాదు, ఒక్కటే. నీవే నేను, నేనే నీవు. ప్రతి ప్రాణియందు కూడనూ, మానవత్వం లోపల, దైవత్వమనేటటువంటి రూపాన్ని మనం తెలుసు కోవాలి. 'దేహో దేవాలయప్రోక్తో, జీవో దేవస్స నాతనః'. దేహమే దేవాలయం, జీవుడే దేవుడు.

"యే జీవంతి స్వధర్మేణ
సంయుంజంతి చ పార్థివాః
న కించిదుప జీవంతి
దాంతా ఉత్థాన శాలినః"

స్వధర్మాన్ని ఆచరిస్తూ జీవనం గడిపేవాళ్ళూ, ధర్మంపైనేలగ్నమైన మనస్సు కలవాళ్ళూ, ఇంద్రియ నిగ్రహం కలవాళ్ళూ, సర్వదా ప్రయత్నశీలులూ అయిన రాజులు ఇతరులపై ఆధారపడరు.

విష్ణువంటే శంఖచక్రగదాధారి అనుకుంటున్నారు. **'అలంకారో విష్ణుప్రియః'** అని అంటారు. **'జలధారో ఈశ్వర ప్రియః'** అంటారు. శంఖ, చక్రములంటే ఏమిటి? 'శంఖము' అనగా శబ్దము. 'చక్రము' అనగా కాలము. కాలము, శబ్దము భగవంతుని స్వాధీనంలోనే ఉన్నాయి. కనుక దేహమనేది ఈ శంఖచక్రగదాధారి కాదు. బలము, కాలము ఈ రెండూ కూడా భగవంతుని చేతిలోనే వుంటాయి. కాబట్టి దైవం ప్రత్యేకంగా ఉన్నాడని, అనేక ఆకారములుగా విశ్వసించి, అనేక విధములైన అలంకారములు మనం చేయకూడదు. భగవంతునికి అలంకారములు చేసి, ఆ అందమును చూచుకొని, ఆనందించటంకాదు. అసలు అందం మనలో ఉన్నది. **'అందమె ఆనందం ఆనందమె జీవిత మకరందం'** అన్నారు. కనుక భగవంతునికి ఎట్టి అలంకారములూ చేయకూడదు. అయితే ప్రపంచంలో పుట్టినందుకు, దీనికి తగినటువంటి గౌరవంగా, మర్యాదగా మనం బ్రతుకుతూ రావాలి. ఆదర్శమును నిరూపించాలి. మీరు అనుకోవచ్చు. స్వామి ఎందుకు ఇంత పెద్దగౌను వేసుకుంటారు? ఇది అలంకారం కోసంకాదు. నాదేహము ఎవరికీ కనిపించకూడదని నా భావన. నా పాదాలుకూడా ఎవరికైనా కనిపిస్తాయేమోనని చాలా జాగ్రత్తగా నడుస్తుంటాను. అనగా మానవత్వంలో వున్నటువంటి దివ్యత్వాన్ని, దేహరీతిగా కూడా గౌరవ మర్యాదలు అందించాలని.

ఈ దేహమునకు 'తుంగభద్ర' అని పేరు పెట్టారు. ఇంత మంగళకరమైన దేహాన్ని అమంగళముగా ఎందుకు చూపించాలి? నాకు ఇష్టంలేదు. చేతులూ, కాళ్లూ చూపించక తప్పదు. ముఖం కూడా చూడక తప్పదు. అప్పుడప్పుడూ నా ముఖం కూడా వెంట్రుకలతో కప్పబడి ఉంటుంది. అది కూడా నాకిష్టంలేదు. కాని నేను ఏమి చేయను. కాని ఈ తేజస్సు పుట్టినటువంటిదేకాని, పెట్టినటువంటిదికాదు. దివ్యత్వానికి ఒక తేజస్సు వెంటవస్తుంది. కనుకనే నేను చేసే ప్రతి చిన్న పనికీ అంతరార్థం లేకుండా ఉండదు.

ఒక చిన్న ఉదాహరణ. ఆకలిలేనప్పుడు అన్నం ఎవ్వరూ తినరు. దప్పిక అయినప్పుడే నీరు త్రాగుతారు. దుఃఖం వచ్చినప్పుడే ఏడుస్తారు. ఆనందం వచ్చినప్పుడే నవ్వుతారు. ఇవన్నీ కారణములులేని కార్యములుకావు. ప్రతి చిన్నదానికి ఒక కారణం ఉంటుంది. ఆ కారణములు నిరూపించే నిమిత్తమై, నేను దేహాన్ని చాలా జాగ్రత్తగా చూచుకుంటాను. ఈ మూడు 'P'లు చాలా ప్రధానమైనటువంటివి. అవే 'Purity, Patience, Perseverance'లు. నేను ఎప్పుడునూ Purity (పవిత్రత). నేను ఏ విధమైన పనిచేసినా గాని, నా కోసంకాదు. నాలోఉన్న Purity (పవిత్రత) ఈ లోకంలో ఎక్కడాలేదని చెప్పవచ్చును. అంత Purity నా హృదయం. కించిత్ మాలిన్యం కూడా చేరటానికి వీలు కాదు. ఆ Purity వలననే జగత్తునంతా ఇక్కడకు తీసుకొని వచ్చింది. నేను ఎవ్వరికీ ఆహ్వానములు పంపను, జాబులు వ్రాయను. కనుక నా దేహము అంత పవిత్రమైనటువంటిది. ఇలాంటి పవిత్రమైన దేహములోపల ఎవ్వరునూ దోషమును చూపలేరు.

ఇక నా యొక్క Patience (శాంతం, సహనం) ఎలా ఉన్నదంటే, పర్వతాలు కదిలినా, నా హృదయం కదలదు. నా హృదయం అంత శాంతంగా ఉంటుంది. అయితే అప్పుడప్పుడు కొంచం 'బుస్' అంటుంటాను. కొంతమందిని సరిచేసే నిమిత్తమై, ఆ పదములు ఉపయోగించెడుతుంటాను. లేకపోతే ఈ పిల్లలు వినేవారు కాదు. 'నాయనా! బంగారు! బంగారు! కూర్చోమ్మా!. కూర్చోమ్మా!' అంటే ఎవరూ వినరు. 'హే! కూర్చో!' అంటే కూర్చుంటారు. అప్పుడు శబ్దాన్ని మార్చవలసి వస్తుంది. ఈ శబ్ద మార్పుల చేతనే, భక్తరక్షణ కూడా జరుగుతుంటుంది. శబ్దములు మార్చడంచేత కొన్ని కార్యములు సక్రమంగా జరిగిపోతుంటాయి. అసత్యమాడకూడదు. కాని శబ్దములను మార్చి ఎదుటివారి క్షేమం కోసం, లోకకళ్యాణం కోసం, లోకోద్ధారణ కోసం ఎంతైనా మనం పని చేయవచ్చును. **'సర్వేలోకహితేరతః'** - అందరి క్షేమమును కోరాలి. ఇది చాలా ప్రధానమైనటువంటిది. **"సర్వేస ముదితాగుణైః"** - మంచి గుణములుకలిగి ఉంటుండాలి. **"సర్వేజ్ఞానైక సంపన్నః"** -మనం జ్ఞానంతో కూడినటువంటివారిగా ఉండాలి. అదియే Purity, Patience, Perseverance. ఈ మూడింటి యందునూ 'సాయి'కి మించినవారు ఎక్కడాలేరు.

**నేను ఏమిచేసినా, ఏమి పలికినా, నా కోసంకాదు. నాకుస్వార్థం ఎక్కడాలేదు. స్వప్రయోజనం అంతకంటే లేదు. ఏ పనిచేసినా మీ కోసమే. ఏది ఆనందించినా మీ ఆనందం కోసమే.**

ప్రేమస్వరూపులైన విద్యార్థినీ, విద్యార్థులారా! దైవతత్త్వాన్ని గుర్తించుకోవటం ఎవరికీ సాధ్యంకాదు.

దైవత్వమును ఎవరూ అర్థం చేసుకోలేరు. కొన్ని నిముషాలలో అర్థం చేసుకున్నట్లుగా నటిస్తారు. మరు నిముషంలో మరచిపోతుంటారు. అంత త్వరగా మారలేరు. కాని క్రమ క్రమేణా మారటానికి ప్రయత్నించండి. Start Early, Drive Slowly, Reach Safely. ఈ వయస్సులోనే అభ్యాసం చేయండి. శాంతమును పోషించండి! పవిత్రతను కించిత్ అయినా మాలిన్యంకాకుండా చూచుకోండి! ఇవి రెండూ ఉంటే Perseverance దానంతట అదే వస్తుంది.

ప్రేమస్వరూపులారా! ప్రేమస్వరూపులారా! అని ఎప్పుడూ మిమ్ములను సంబోధిస్తుంటాను. నాయందున్నదంతా ప్రేమనే. కనుక నేను పలికే పలుకులు కూడా ప్రేమవే. మీరందరూ ప్రేమస్వరూపులవ్వాలి. ఎలాంటి పరిస్థితుల లోను ప్రేమకు ఏ మాత్రం లోటు కలిగించకుండా చూచుకోవాలి. ఆ విధంగా మీరు జీవించుతు రండి. మీకు ఏది కావల్సినా నేను ఇస్తాను. మీరే భావిభారతోద్ధారకులు. ఈనాటి విద్యార్థినీ, విద్యార్థులే భవిష్యత్తులో మన భారత దేశానికి లీడర్సు, ప్లీడర్సు. దుర్భావనలు విడనాడండి, సద్భావనలు పెంచుకోండి, సదుద్దేశ్యంతో జీవించండి. పవిత్రమైన దృష్టిని కలిగివుండండి. దృష్టి దోషంగాని, వాక్‌దోషంగాని లేకుండా చూచుకోండి. ఈ విధమైన మంచి నడతలతో మీరుండి నప్పుడు, మీ తల్లిదండ్రులు కూడా ఎంతో ఆనందిస్తారు. వారిని ప్రేమించి, ఆదరించి, ఆశ్రయించి, ఆనంద పెట్టండి.

*(ది. 18-5-2000 బృందావనం (బెంగుళూరు)లో వేసవి తరగతుల సందర్భమున భగవాన్‌సాయి చేసిన దివ్యప్రసంగం నుండి)*



# పురుష సూక్తము 15

ఓం నాభ్యా ఆసీ దంతరిక్షం
శీర్ష్ణోద్యౌః సమవర్తత।
పద్భ్యాం భూమి ర్దిశశ్శ్రోత్రా
త్తథా లోకాగం అకల్పయన్॥

| | | |
|---|---|---|
| నాభ్యాః | - | యజ్ఞ పురుషుని నాభి నుండి |
| అంతరిక్షమ్ | - | అంతరిక్షం |
| ఆసీత్ | - | కలిగింది |
| శీర్ష్ణన్ | - | స్వామి శిరస్సు నుండి |
| ద్యౌః | - | ద్యులోకం |
| సమవర్తత | - | ప్రభవించింది |
| పద్భ్యామ్ | - | స్వామి పాదాల నుండి |
| భూమి | - | భూలోకం |
| శ్రోత్రాత్ | - | స్వామి చెవుల నుండి |
| దిశ | - | దిశలు కలిగాయి |
| తథా | - | ఆ విధంగా |
| లోకాన్ | - | ఈ లోకాలను దేవతలు |
| అకల్పయన్ | - | కనుగొన్నారు |

వ్యాఖ్య:

విశ్వవిరాట్ పురుష స్వరూపం ఇది ఆ యజ్ఞపురుషుని నాభి అంతరిక్షం శీర్షం ద్యులోకం. పాదాలు భూలోకం. శ్రవణాలు దిశలు. స్వామి బ్రహ్మాండ మంతటా నిండి వున్నాడు ముందుగా మహర్షులు స్వామి గరిమనాభి గుర్తించారు. అది అంతరిక్షం. అటు పైన శిరస్సు, ఇటు పాదద్వయం, ద్యులోకం,

మనకు పై భాగాన గొడుగు వలె కనిపించు పార ద్యులోకం. ఈ ద్యులోకం అంతా ప్రాణవాహిని తరంగాలతో నిండి వుంటుంది. ఆ ప్రాణవాహిని నుండి జీవకోటులు ఆకారాలు దాల్చి వస్తుంటాయి ఈ జీవకోటిరాశి చక్రగమనాన్ని అను సరిస్తుంది. ఇది అంతరిక్షం. ఇది స్వామి నాభిప్రదేశం శిరః ప్రదేశం. శీర్షం జ్ఞాన భాండారం. వీనికి హద్దులులేవు దిశలు స్వామి శ్రవణాలు. ఇవి శబ్దగ్రహణాలు శబ్దగ్రహణ శక్తికి శ్రవణాలు మూలస్థానాలు. భూమి అన్నిటికి ఆధారభూమి. స్వామి పాదభూమి ఇది. ఇది భౌతిక ఆకారం. ఆయాగ్రహాల భౌతికరూపాలు, భూములు ఇది ఈ విధంగా మానవశరీరానికి అన్వయం అవుతుంది అన్ని గోళాలకు అన్వయిస్తుంది. విశ్వ విరాట్ పురుషుని చిన్న మాదిరి బొమ్మే కదా జీవుడు. జీవులలో మేటి మానవుడు.

- జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

#  అంగారకుని మీద నీరు, జీవం ఉన్నాయా? 

19వ శతాబ్దంవరకూ కూడా శక్తివంతమైన దూరదర్శినాలు ఉండేవికావు. విలియం హెర్‌శ్చెల్ అనే ఖగోళ శాస్త్రవేత్త అంగారక గ్రహాన్ని దూరదర్శిని ద్వారా పరిశోధిస్తున్నప్పుడు ఆ గ్రహ ఉపరితలం మీద నవారు అల్లికలాగా చారలు కనిపించాయి. అవి కాలువలని, అమిత ప్రతిభావంతులైన అంగారక గ్రహ ఇంజనీర్లు వాటిని నిర్మించారని ఆయన భావించాడు. అప్పటి వరకు సౌర కుటుంబంలో ప్రాణికోటి ఉండగల అవకాశం ఉన్న గ్రహం భూమికాక, అంగారకుడు మాత్రమేనని భావిస్తూ ఉండేవారు. హెర్‌శ్చెల్ ప్రకటనతో ఈ భావనకి బలం చేకూరింది. దాంతో ఆ పరలోక వాసులతో సంబంధాలు పెట్టుకోవాలని శాస్త్రవేత్తలు ఉవ్విళ్ళూరారు. అంతేకాదు హెచ్.జి. వెల్స్ వంటి రచయితలు అంగారక గ్రహవాసులు భూమిపై దాడిచేసినట్లు చిత్రించే 'వార్ ఆఫ్ ది వరల్డ్స్'అన్న నవలను రచించారు. దీనిని నాటకంగా న్యూయార్క్ రేడియో ప్రసారం చేసినప్పుడు అది నిజమేననుకుని ఎందరో ప్రజలు మూటాముల్లెతోసహా పరుగులు తీశారట. అయితే 1970 దశకంలో అమెరికా పంపిన 'వాయేజర్', 'వైకింగ్' వంటి అంతరిక్ష నౌకలు అంగారక గ్రహంపై దాగి అక్కడి చిత్రాలు పంపడంతో అక్కడ బుద్ధిజీవులుకాదు కదా గడ్డిపరకలు, ఆఖరికి క్రిమికీటకాలు కూడా లేవని నిరూపితమయింది.

అయితే రెండేళ్ళక్రితం అమెరికాలోని నాసా కేంద్రం అంగారకుని మీదికి పంపిన "పాత ఫైండర్" పంపిన చిత్రాలు విభ్రాంతికరమైన విశేషాలను వెల్లడించాయి. అంగారకుని మీద నూరుకోట్ల సంవత్సరాల ముందు బ్రహ్మాండమైన నదులు పారాయిట. అవి ఇంకిపోయిన లేదా ఇగిరిపోయిన ఆనవాళ్ళు స్పష్టంగా కనిపించాయి. మరి ఆ నీరు ఏమైనట్లు? నదులు పారినప్పుడు జీవజలం ఉండేదా? నదులతోపాటు అదీ అంతరించిందా? ఇది ఇంకా సమాధానం చిక్కని ప్రశ్నలు.

అంగారకునిమీద ధృవాల చుట్టూ నీరు గడ్డకట్టి మంచురూపంలో ఉండడాన్ని గతంలో ఎన్నో ఫోటోలు వెల్లడి చేశాయి. అయితే అది గడ్డకట్టిన నీరా, ఘనీభవించిన కార్బన్ డయాక్సైడా? అన్న ప్రశ్న మిగిలింది. అయితే ఇప్పుడు ఒకప్పుడు అక్కడ అధిక పరిమాణంలో నీటివనరులు ఉండినట్లు తెలియరావడంతో, ధృవాల దగ్గర మాత్రం నీరు మిగిలిందనీ, అది మంచురూపంలో గడ్డకట్టుకుని ఉందనీ శాస్త్రవేత్తలు భావిస్తున్నారు. అంగారకుని మీద అంతోఇంతో నీరుంది. పల్చగానైనా వాతావరణం ఉంది. ఉపరితల ఉష్ణోగ్రతలు బాధాకరమైనవైనా, ప్రాణాంతకమైనవి కావు. ఇవన్నీ జీవావిర్భావానికి అనుకూల పరిస్థితులే. కనీసం అల్ప జాతి మొక్కలు, క్రిములు ఉండవచ్చు. కాని ఇప్పటి వరకు ఇట్టివి ఉన్నట్లు దాఖలాలు ఏమీలేవు. అయితే అంగారకుడి మీద గతంలో జీవం ఉండి ఉండవచ్చుననడానికి ప్రబల మైన తార్కాణాలు లభించాయి. 1911వ సంవత్సరం జూన్ 28వ తేదీన అంగారక గ్రహానికి చెందిన నాఖ్లా అనే ఉల్క అంతరిక్షంలో ప్రేలిపోయి కొన్ని శకలాలు భూమిమీద పడ్డాయిట వాటిలోని నలభై ముక్కలను శాస్త్రవేత్తలు సేకరించి లండన్ మ్యూజియంలో భద్రపరిచారు.

ఇదిలా ఉండగా గత సంవత్సరంలో శాస్త్రజ్ఞులకి అంటార్కిటికా ఖండంలోని మంచు దిబ్బల్లో అంగారక గ్రహానికి చెందినవిగా భావించిన కొన్ని శకలాలు లభ్యమయ్యాయి. వాటిని పరిశీలించిన శాస్త్రజ్ఞులు విభ్రాంతికి లోనయ్యారు. ఆ శకలాలపై కొన్ని రకాల సూక్ష్మజీవుల ఆనవాళ్ళు శిలాజాల రూపంలో దర్శనమిచ్చాయి. అవి 0.2 - 1 మైక్రో మీటర్ పొడవుతో కొన్ని గోళాకారంలోనూ, మరికొన్ని గిన్నెల ఆకారంలోనూ ఉన్నాయి. ఇవి విడి విడిగానూ, సమూహాలుగాను కూడా ఉన్నాయి. ఈ శకలాలు కొన్ని కోట్ల సంవత్సరాల నాటివిగా వారు అంచనా వేశారు. అంటే అప్పుడు అంగారకుని మీద సూక్ష్మరూపంలోనైనా జీవం ఉండిందని నిర్ధారణ అయింది. వెంటనే శాస్త్రజ్ఞులు లండన్ మ్యూజియంలో ఉన్న శకలాలను కూడా పరిశోధించారు. వాటిలో కూడా ఇటువంటి శిలాజాలు కనిపించాయి సూక్ష్మ జీవులు అంత త్వరగా అంతరించవు. నిద్రాణ స్థితిలోనైనా ఉంటాయి. కాని పూర్తిగా అంతర్ధానం కావు. కనుక అంగారకునిలో ఇప్పటికే సూక్ష్మజీవుల రూపంలోనైనా జీవం ఉండవచ్చునని భావిస్తున్నారు.

ఇదిలావుండగా 1970 దశకంలో వైకింగ్ నౌక అంగారకుని పర్వతాలలో మనిషి ముఖాన్ని పోలిన శిల్పాన్ని కనుగొంది. ఇటీవల అంగారక తలంపై హృదయ ఆకారంలో వున్న చిత్రం కనిపించింది. ఇవి స్వాభావికంగా ఏర్పడ్డాయను కోవడానికి వీలులేదు. ఇవి గతంలో వర్ధిల్లి తర్వాత అంతరించిన నాగరికత గలిగిన అంగారక గ్రహవాసులు తమ ఉనికికి గుర్తుగా వదిలినట్టివా? ఈ ప్రశ్నలకు సమాధానం త్వరలోనే లభించే అవకాశం ఉంది.

**- కె.ఆర్.కె. మోహన్**



# ధర్మము



ముచ్చటైన మూడక్షరముల పదము ధర్మము.... పదము చిన్నదైనా, అర్థము అనంతం!

కడుపేదవాడిని "మీకు తోచిన ధర్మము చేయండి" అని వేడుకొన్నప్పుడు, ధర్మమనగా ఉదారముగా సహాయము చేసి పుణ్యము కట్టుకొనండి అని అర్థము. "మామా! మాయాద్యూతమున మోసముతో మమ్మిట్లు పరాజితులను చేయుట నీకు ధర్మమా!" అని పాండవులు శకుని మామను అడిగితిరనుకొందము. అప్పుడు అక్కడ ధర్మమనిన న్యాయమని కదా అర్థము.

'నీరుపల్లమెరుగు - నిజము దేవుడెరుగు' - అన్న సామెతలో పల్లమునకు పారుట నీటి ధర్మము - అనగా స్వభావమని మనకు తెలియుచున్నది.

అసలు ధర్మమనిన సత్యము. ధర్మపథమనిన సన్మార్గము. ధర్మమును పాటించవలెను. ధర్మమును వీడరాదు, ధర్మ మార్గముననే పయనించవలెనని మనకు ప్రతి నిత్యము పురాణేతిహాసములు ప్రబోధిస్తూనే ఉంటాయి. కాని ధర్మ మార్గపయనము బోధించినంత సులభ సాధ్యముకాదు. ధర్మపథమన్నది పూలబాటకాదు. ధర్మమునకు కట్టుబడి యుండవలెనన్న మానవునికి ఎంతో గుండె నిబ్బరము, మనో నిగ్రహము అవసరము. దస్తుతః మానవ బుద్ధిచంచలము.

ప్రతి మనిషి ధర్మమార్గమునసనుసరించవలెననియే, మనసునందు నిశ్చయించుకొనును. కాని లౌకిక జీవనములో సమస్యలెదురైనప్పుడు, ధర్మమార్గమునతిక్రమించుట సహజము. ఎట్టి పరిస్థితులలోను, ఎన్ని కష్టనష్టములెదురైనను, ధర్మపథమును వీడకుండ జీవితము గడపుట, మానవునికి, అసిధారా వ్రతము వంటిదే! అడుగడుగునా అవాంతరాలు, అడ్డంకులు క్షణక్షణమూ ఎదురైనా, ధృతి చెడకుండా, ముందుకు సాగిపోగలగాలి! దృఢ సంకల్పముతో కడదాకా కృషిచేయాలనే మనోనిగ్రహంగల మానవుడు, లౌకిక, ప్రాపంచిక విషయాల లోను, ఆధ్యాత్మిక కార్యకలాపాలలోను, మరి ఏ యితర కార్యములలోను కూడ విజయాన్ని సాధించగలుగుతాడు. మానవుని ధర్మపథ జీవితానికి అవసరమగు నియమ నిబంధనలూ, ఆచార్య వ్యవహారాలు, సద్బోధనలు ఎన్నో మన పురాణేతిహాసాలలో పొందుపర్చబడ్డాయి.

కాని, తన అవసరార్థం ఆ నియమ నిబంధనలకు, అప్పుడప్పుడు, మార్పులు, చేర్పులు చేసికోవటం మానవుని స్వభావం! అంతేకాదు. మనసు పరిశుద్ధముగా ఉన్నంత కాలము, బాహ్యకర్మలు ఎట్లున్ననూ ప్రమాదములేదనే వితండవాదంతో, తన చర్యలను తాను సమర్థించుకో చూస్తాడు.

ఇంద్రియ నిగ్రహసాధన కోసమే, ఆ పవిత్ర గ్రంథాలలో నిత్యకర్మలు, ఆచార వ్యవహారాలు, ఉపదేశించబడ్డాయని మానవుడు గుర్తుంచుకోవాలి ఈ కర్మగర్భ రహస్యాన్ని మర్చిపోయిగాని, గాలికొదిలేసిగాని, తన యిష్టానుసారము ప్రవర్తించినవానికి తాత్కాలికానందం కలిగినా, కాలం గడిచిన కొద్దీ ఎదురు దెబ్బలు తగలక తప్పవు! అందుకని పదిబారల దూరము ఎక్కువైనా పదిలమైన రహదారిని పయనించడమే శ్రేయస్కరం! అంతేకాని అడ్డదారినపోయి ఆపదలు కొని తెచ్చుకోవడం అవివేకం!

తన తండ్రి, దశరథ మహారాజు కైకేయికి యిచ్చినమాట నిలబెట్టటం కోసం, అయోధ్యా రాజ్యసింహాసనానికి అన్ని విధములైన అర్హత కలిగివున్నా, శ్రీరాముడు ఆ రాజ్యాధికారాన్ని తృణప్రాయంగా విసర్జించి, కారడవులకేగి, పలు విధముల యిడుమలు పడుటకే సంసిద్ధుడైనాడు. దేని కోసం? తన జీవితంలో ధర్మాచరణ కోసం, మానవలోకంలో ధర్మస్థాపన కోసం! ప్రతి మనిషి జీవితంలోను, ధర్మం పోషించబడాలి, రక్షించబడాలి అన్న నియమాన్ని నెలకొల్పడానికే భగవంతుడు రామావతారం దాల్చాడు. ధర్మం కోసం అంతటి మహోన్నత త్యాగం చేసిన మహాపురుషుడు కాబట్టే శ్రీరాముని కీర్తి ప్రతిష్టలు అజరామరము, అనన్యసామాన్యము.

'నాయనా! రామా! నీ వనవాస కార్యక్రమాన్ని నిలుపుదల చేయడమసాధ్యము. కావున బయలుదేరు. సదా ధర్మ మార్గాన సంచరించు! త్వరలో తిరిగి రా! నీ ధర్మమే నీకు రక్ష!' అన్న కౌసల్య పలుకులు ధర్మ ప్రాశస్త్యాన్ని మనకు గుర్తు చేస్తాయి. లౌకిక జీవనంలో ఒడిదుడుకులెన్నో ఎదురు కావచ్చు! తన్మూలంగా కష్టకాలాల్లో మనిషి ధర్మనియమాలకు తిలోదకాలిచ్చే స్థితికి దిగజారరాదన్న నగ్నసత్యాన్ని మనకందరకు కళ్ళెదుట నిలిపే మహా కావ్యమే రామాయణము! ☆

సోమంచి రామం

# నిజాయితీ, నిరాడంబరతలకు నిలువెత్తురూపం రామస్వామిరెడ్డి

తమిళనాడులోని తంజావూరు మధురై ప్రాంతాలను విజయనగర సామ్రాజ్య చక్రవర్తులైన నాయకరాజులు పరిపాలిస్తున్న కాలంలో అంటే షుమారు నాలుగు అయిదు వందల సంవత్సరాల క్రితం అనేక వేల తెలుగు కుటుంబాలు అక్కడకు వెళ్లి స్థిరపడ్డాయి. ఆ విధంగా వెళ్ళినవారు అక్కడ తమిళ సంస్కృతి సాంప్రదాయాల స్రవంతిలో పూర్తిగా విలీనమయినా, ఇళ్లలోమటుకు తెలుగునే మాట్లాడుకుంటూ తెలుగు సంప్రదాయాలను ఆచారాలను పరిరక్షించుకుంటూ వస్తున్నారు. అట్టివారిలో తెలుగులో మహా విద్వాంసులూ, కవులూ, వాగ్గేయకారులు ఉన్నారు. తమిళనాడులో తెలుగు బోధించే పాఠశాలలు లేకపోయిన తెలుగు రాయడం చదవడం తెలియక పోయినా తెలుగును మరచిపోకుండా తరతరాలుగా పరిరక్షించుకుంటూ వస్తున్నారు. తమిళనాడులో స్థిరపడ్డ చాలామందికి తెలుగు చదవడం రాయకపోయినా కొందరు అభిమానంతో స్వయం కృషితో తెలుగును చదవడం, రాయడం నేర్చుకుని తమ భాషాభిమానాన్ని చాటుకున్నారు. ఈ తెలుగువారు తెలుగు తమిళ సంస్కృతిల మేలు కలయికకు ప్రతీకలుగా నిలిచారు.

అట్టి వారిలో ఉమ్మడి మద్రాస్ రాష్ట్రానికి 1947 ఫిబ్రవరి నుంచి షుమారు రెండు సంవత్సరాలు ప్రీమియర్‌గా పనిచేసిన ఓమాండూరు రామస్వామి రెడ్డియార్‌గారు ఒకరు. 1946లో దేశంలోని వివిధ రాష్ట్రాలకు జరిగిన సాధారణ ఎన్నికలలో మద్రాస్ రాష్ట్రంలో కూడా కాంగ్రెస్ జయదుంధుభిని మ్రోగించింది. మహాత్మాగాంధి తన వియ్యంకుడయిన రాజాజీని మద్రాస్ రాష్ట్రానికి ప్రీమియర్‌గా చేయ ప్రయత్నించినపుడు ఆ ప్రయత్నాలను ఆంధ్ర కేసరి ప్రకాశం వమ్ముచేసి కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీకి జరిగిన ఎన్నికలలో గెలిచి ప్రీమియర్ అయ్యారు. ఐతే ఆంధ్ర ప్రాంతంలో ప్రకాశాన్ని తీవ్రంగా వ్యతిరేకించే ఒక వర్గం (పట్టాభి) వుండేది. దీనికి కళా వెంకటరావు, నీలం సంజీవరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి నాయకులు. మద్రాస్ కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీలో ప్రకాశం వ్యతిరేక వర్గం బలం పుంజుకోవడంతో ఏడాది కాకుండానే ప్రకాశం ప్రభుత్వం పతనమయింది. తర్వాత కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ నాయకునికై జరిగిన ఎన్నికలలో ఓమాండూరు రామస్వామి రెడ్డియారు నెగ్గారు. తను ఎన్నికయినట్లు ప్రకటించగానే రామస్వామిరెడ్డియారు చేసిన మొదటి పని - ప్రకాశంగారికి సాష్టాంగ నమస్కారం చేసి ఆశీస్సులు పొందడం.

ప్రకాశంగారిలాగానే ఓమాండూరు రామస్వామి రెడ్డిగారు నిరాండంబరుడు, అకళంక దేశభక్తుడు. నిస్వార్ధ పరుడు. వీటన్నింటినిమించి నిజమైన దైవచింతన కలవాడు.

## కంచి వాసుదేవరావు

రామస్వామిరెడ్డియారు దక్షిణ ఆర్కాట్ జిల్లా దిండివనం సమీప గ్రామంలోని ఒక సామాన్య రైతు కుటుంబంలో 1895 సంవత్సరం ఫిబ్రవరి ఒకటవ తేదీన జన్మించారు. చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయారు. అందువలన పెద్దచదువు అబ్బలేదు. థర్డ్‌ఫారంతో (ఇప్పటి ఎనిమిదవ తరగతి) ఆయన చదువు ఆగిపోయింది. పాఠశాలలకు వెళ్లి చదువుకోకపోయినా స్వయంకృషితో తమిళమేకాక తెలుగు, ఇంగ్లీషులలో తగినంత పరిజ్ఞానం సంపాదించుకుని అనేక పుస్తకాలను చదువుతూ వుండేవారు. అనేక పత్రికలను తెప్పించుకుని జీవిత చందా దారులుగా చేరి ఆ పత్రికలను ప్రోత్సహిస్తూ వుండేవారు. ఒక ప్రణాళిక ప్రకారం ఏ పుస్తకాలు చదవాలో, ఏ పుస్తకాలు కొనాలో నిర్ణయించుకునేవారు. అప్పటి మద్రాస్ గవర్నర్ సర్‌ఆర్ట్‌బాల్డు రామస్వామిరెడ్డియారు గారి పఠనాసక్తిని గమనించి స్వదేశం ఇంగ్లాండుకు వెళ్ళిన తర్వాత కూడా కొన్ని మంచి పుస్తకాలను పంపుతూ ఉండేవారంటే నమ్మశక్యంగా ఉండదు.

మాతృభాష అయిన తెలుగంటే మరింత అభిమానం. అనేక తెలుగు గ్రంధాలను చదివారు. వేలూరు నారాయణ రెడ్డి అనే తెలుగు పండితుని దగ్గర రామస్వామి తెలుగు

వ్యాకరణాన్ని నేర్చుకున్నారు. వేమన అంటే ఆయనకు ప్రత్యేకాభిమానం. వేమన పద్యాలన్నిటినీ కంఠస్తం చేశారు. బడీవారు అనే గ్రామంలో ఒక గురుకుల పాఠశాలని స్థాపించి దానికి వేమన పేరు పెట్టారు. తన ప్రసంగాలలో సందర్భానుసారంగా అనేక తెలుగు సామెతలను ఉటంకిస్తూ వుండేవారుట. విద్యార్జనకు వయోపరిమితి ఉండదని తను 70వయేట సంస్కృత భాషను నేర్చుకోవటం ద్వారా నిరూపించారు. కర్ణాటక సంగీతమంటే ఎంతో అభిమానం.

ఆయన జీవితంలో అనేక ఎదురుదెబ్బలు తగిలాయి. తండ్రి, తల్లి, భార్య, పుట్టిన ఒక ఆడ శిశువు మరణించారు. చివరకు తను ప్రాణప్రదంగా చూచుకున్న కుమారుడు సుందరం కూడా మరణించాడు. దాంతో జీవితంలో ఒంటరి వాడయ్యాడు. ముందు భార్య మరణంతో విరక్తి చెంది కొంత కాలం తనవూరి సమీపంలో వున్న కొబ్బరి తోటలో ఒక ఆశ్రమం నిర్మించుకుని విరాగిజీవితం గడిపాడు. కుమారుడు కూడా మరణించడంతో సంసారభవబంధాలు తెగిపోయాయి. ఆ సమయంలో తన కోసంకాక దేశంకోసం జీవించి తన బ్రతుకును సార్థకం చేసుకోగల మార్గం లభించింది.

1919లో భారతదేశ రాజకీయాలు పెద్ద మలుపు తిరిగాయి. బ్రిటీష్ ప్రభుత్వం ప్రతిపాదించిన మాంటెంగ్ చేమ్స్‌ఫర్డ్ సంస్కరణలు కాంగ్రెస్ నాయకులకు తీవ్రమైన నిరాశను, అసంతృప్తిని కలిగించాయి. ఆందోళన ప్రారంభ మయింది. దాన్ని అణచడానికి బ్రిటీష్ ప్రభుత్వం అతి క్రూరమైన రౌలట్ చట్టాన్ని విధించింది. జలియన్‌వాలా బాగ్‌లో పోలీసులు జనరల్ డయ్యర్ నాయకత్వంలో జరిపిన కాల్పులలో అనేకమంది అమాయకులు మరణించారు. దేశం అట్టుడికి పోసాగింది. లోకమాన్య తిలక్ దివంగతులు కావడంతో మహాత్మాగాంధీ స్వాతంత్ర్య సమరానికి నాయకత్వం వహించి, అపూర్వమైన శాంతి, అహింసా పద్ధతులలో బ్రిటీష్ ప్రభుత్వంపై పోరాటం ప్రకటించారు. ఆయన పిలుపు విని ఎంతోమంది స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు. భోగులు జోగులయ్యారు. ఆస్తులు కోల్పోయారు. జైలుకు వెళ్ళారు. లాఠీదెబ్బలు తిన్నారు. మహాత్ముడు మట్టి నుండి మాణిక్యాలను సృష్టించారు. అట్టివారిలో రామస్వామి రెడ్డిగారు ఒకరు.

1920లో మాంటెంగ్ ఛేమ్సు సిఫార్సులకు అనుగుణంగా వివిధ రాష్ట్రాల లెజిస్లేటివ్ కౌన్సిల్లకు ఎన్నికలను నిర్వహించాలని బ్రిటీష్ ప్రభుత్వం నిర్ణయించింది. ఈ ఎన్నికలను ప్రజలు బహిష్కరించాలని మహాత్మాగాంధీ నాయకత్వంలో కాంగ్రెస్ పిలుపు ఇచ్చింది. ఈ పిలుపు నందుకుని రామస్వామిరెడ్డియారు దక్షిణ ఆర్కాటు జిల్లాలో గ్రామగ్రామం తిరిగి కాంగ్రెస్ సందేశాన్ని ప్రచారం చేశారు. ఫలితంగా జిల్లాలో ఎన్నికల బహిష్కరణ విజయవంత మయింది. 1920 నాగపూర్‌లో సేలం విజయ రాఘవాచారి అధ్యక్షతన చారిత్రాత్మకమైన కాంగ్రెస్ మహాసభలు జరిగాయి. ఈ మహాసభలలో పాల్గొనేందుకు రామస్వామి రెడ్డియారు అనేక మంది జిల్లావాసులతో వెళ్ళారు.

ఖద్దరు బట్టల మూటలను భుజాన వేసుకుని వీధివీధులలో అమ్మారు. విదేశీ వస్త్రబహిష్కరణ చేశారు. కల్లుపాకలవద్ద పికెటింగ్‌లు చేస్తూ మధ్యపాన నిషేద ఉద్యమాన్ని నిర్వహించారు. ప్రాంతీయ రాజకీయ సభల్ని నిర్వహించారు. ఉప్పు సత్యాగ్రహ సమయంలో చరిత్రాత్మకమైన వేదారణ్య యాత్రలో పాల్గొని అరెస్ట్ అయ్యారు. ఈ అన్ని కారణాలవలన 1930 దశకం చివరకు తమిళనాడు కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నికయ్యారు. కామరాజు నాడర్‌కు రాజకీయ గురువు రాజాజీకి సమ వుజ్జీ అయిన సత్యమూర్తిపై 35 ఓట్ల తేడాతో ఘనవిజయం సాధించడం ఈ ఎన్నికలలో విశేషం. 1937లో మద్రాస్ కౌన్సిల్‌కు

జరిగిన ఎన్నికలలో దక్షిణ ఆర్కాటు జిల్లాలో కాంగ్రెస్ ప్రచారానికి సారధ్యం వహించారు. జస్టిస్ పార్టీ కంచు కోటలో దక్షిణ ఆర్కాటు జిల్లా ఒకటి. ఆ కంచుకోటను పగలగొట్టి కాంగ్రెస్‌కు ఘనవిజయం సాధించి పెట్టిన కీర్తి రామస్వామిరెడ్డియార్‌కే దక్కుతుంది. 1942లో క్విట్ ఇండియాలో పాల్గొని అరెస్టయ్యారు.

1935లో అఖిల భారత జాతీయ కాంగ్రెస్ స్వర్ణోత్సవాలు జరిగాయి. ఈ సందర్భంగా విల్లుపురంలో కమలా నెహ్రూ పేరుతో ఒక కాలనీని నిర్మించారు. కుంతేరు అన్న గ్రామంలో కమలాదేవి నెహ్రూ పేరిట ఒక పాఠశాలను స్థాపించారు. ఆయనకు తమిళనాడు కాంగ్రెస్ నాయకులలో పి. కుమారస్వామి రాజా, ఎం. భక్తవత్సలం సన్నిహితులు. వీరిద్దరూ రామస్వామిరెడ్డియార్ తర్వాత ముఖ్య మంత్రులుగా పనిచేశారు.

1947 ఫిబ్రవరిలో ప్రకాశం మంత్రివర్గం పతనమయిన ఓమాంజారు రామస్వామిరెడ్డియారు ముఖ్యమంత్రి అయ్యారు. ముఖ్యమంత్రి అయిన రెండేళ్ళకన్న ఎక్కువ కాలం ఆ పదవిలో కొనసాగలేకపోయారు. ఆయన తర్వాత తమిళనాడులో అనేక తరాల క్రితం స్థిరపడిన మరో తెలుగు ప్రముఖుడు పూసపాటి కుమారరాజా ముఖ్యమంత్రి అయ్యారు. భక్తవత్సలం తమిళనాడును పరిపాలించిన ఆఖరు కాంగ్రెస్ ముఖ్యమంత్రి.

ఓమండురు రామస్వామిరెడ్డి అసలు సిసలు రైతుబిడ్డ. రైతు శ్రేయస్సుకు ఆయన తన పదవీకాలంలో ప్రధమ ప్రాధాన్యత యిచ్చి అనేక చర్యలు తీసుకున్నారు. హిందూ సమాజానికి మచ్చగామారిన దేవదాసి వ్యవస్థ నిర్మూలన చట్టం ఆయన ముఖ్యమంత్రిగా వుండగానే జరిగింది. ప్రకాశంగారి కాలంలో రాష్ట్రంలో ఎనిమిది జిల్లాలకే పరిమితమయిన మధ్యపాన నిషేధ చట్టాన్ని రాష్ట్రమంతటికీ వర్తింపచేశారు. తమిళాన్ని మద్రాస్ రాష్ట్రంలోని తమిళ ప్రాంతాలలో రాజభాషజేయడానికి ఆయన అనేక చర్యలు తీసుకునేవారు.

ముఖ్యమంత్రిగా వుండగా ఆయన కార్యదర్శులపై ఆధారపడేవారుకాదు. స్వయంగా నోట్సు రాసుకునేవారు. అవసరమైతే జిల్లా కలెక్టరును నోట్సు నిలదీసే ధైర్యం ఉండేది. విధానసభ, విధాన పరిషత్తులలో సభ్యులు అడిగిన ప్రశ్నలకు తడుము కోకుండా ఇంగ్లీషులో జవాబు చెప్పగలిగేవారు.

నీతికథలు - 8

## నక్క - దురాశ

కళ్యాణకటకమనే పట్టణంలో భైరవుడనే బోయవాడు వుండేవాడు. వాడొకనాడు వేటకోసం విల్లు, బాణాలు, వల, వుచ్చులు, చిక్కం మొదలైన సాధనాలు తీసుకొని, వింధ్య పర్వతం చెంత అరణ్యానికి పోయాడు. అక్కడ వాడొకమాటు ఏర్పరచుకొని, ఎరపెట్టి, పొంచి వుండి, ఒక బలిసిన జింకను బాణంతో కొట్టి చంపి, చంకలో బెట్టుకొని వస్తుండగా, నడగొండవంటి ఒక పంది కనబడింది. ఆ వేటకాడు తన అదృష్టంవల్ల మరో జంతు మాంసం గూడ దొరికిందని సంతోషించాడు. జింకను నేలదించి, విల్లెక్కుపెట్టి బాణాన్ని సంధించి పందిని కొట్టాడు. దెబ్బ తగిలిన తోడనే ఆ వరాహం కోపంతో పెట్రేగిపోయి బాణవేగంతో ఘుర్ఘురిస్తూ పరిగెత్తి వచ్చి వాణ్ణి కొమ్ముతో పొడిచింది. వాడు మొదలునరికిన చెట్టు మాదిరి నేల గూలి విలవిల తన్నుకుంటూ ప్రాణాలు విడిచాడు. పంది గూడ బాణం వేటుకు చచ్చింది. అక్కడ ఒక పాము గూడ పంది, వేటకాని తొక్కిళ్ళలో నలిగి మడిసింది.

అంతనొక నక్క దీర్ఘారావం అనే పేరు గలది. ఆహారం కోసం వనంలో తిరుగుతూ, అక్కడికి వచ్చి, చచ్చి పడివున్న సర్ప - కిరాత - వరాహ - మృగాలను చూసి, 'నాకు భోజనం సమృద్ధిగ లభించింది' అని ఆనందంతో గంతులువేస్తూ, ఇలా ఆలోచించింది. "నాకు మూడునెలల భోజనానికి వీటి మాంసం సరి పోతుంది. ఒక్కనెల వేటగాని మాంసంతో గడపొచ్చు. జింక, పంది మాసంతో రెండు మాసాలు జరపొచ్చు. ఒక్కదినానికీ పాము చాలు. ఇప్పటి ఆకలి ఈ వింటి తాటి నరంతో తీర్చుకొంటాను" అనుకొని తిరిగి, దగ్గఱికి పోయి, వింటి తాటినరం పంటితో నొక్కి కొఱకగానే ఎక్కుపెట్టివుండిన ఆ వింటు బద్దబిగువు సడిలి దెబ్బ ఫెడీమని ఱొమ్ముకు తగిలింది. ఆ దెబ్బతో నక్క నేలగూలి గిలగిల కొట్టుకుంటూ చచ్చింది.

**నీతి : దురాశ దుఃఖమేగాక, చేటు తెస్తుంది.**

**అమితంగా కూడబెట్టుకోవాలనుకోవడం మంచిదికాదు.**

**- యం. మునికృష్ణారెడ్డి**

దక్షిణ ఆర్కాటుజిల్లాలో కుష్టు వ్యాధి ఎక్కువగా వున్నందు వలన ఆ వ్యాధి నిర్మూలనకు ప్రత్యేక కృషి చేశారు. ఐతే ఆయన అధికారంలోవున్నది రెండు సంవత్సరాలు. కాంగ్రెస్ ముఖ్యమంత్రులను తరచు మార్చే సాంప్రదాయం నెహ్రూ కాలంలోనే ప్రారంభమయింది. 1946 - 52 మధ్య మద్రాస్ రాష్ట్రాన్ని ముగ్గురు ముఖ్యమంత్రులు పాలించారు. అల్లాగే బొంబాయి, బెంగుళూరు, పంజాబు, ఒరిస్సా ముఖ్య మంత్రులూ మారారు.

ఆయన ప్రయత్నించకుండానే ముఖ్యమంత్రి పదవి లభించింది. ఆయన నిమిత్తం లేకుండానే దిగిపోవలసి వచ్చింది. అప్పుడు ఆనందపడలేదు. ఇప్పుడు విచారింపలేదు. పదవినుంచి ఎటువంటి ఫిర్యాదులేకుండా వైదొలగి వ్యవసాయం పై దృష్టికేంద్రీకరించారు. ఆయన నిమ్మకూరులో పండించిన నిమ్మకాయలకు ప్రత్యేక గిరాకీ ఉండేదట.

ముఖ్యమంత్రి పదవీ విరమణ చేశాక ఆయనకు గవర్నర్ పదవిని యివ్వచూపారు. మరొకరయితే అయాచితంగా లభించిన రాజభవన వైభోగాలని మారు మాట్లాడకుండా అంగీకరించి వుండేవారు. కాని నిరాడంబర జీవితాన్ని ఆయన కోరుకుంటారు. కనుక ఆ పదవిని తిరస్కరించారు.

దంపుడు బియ్యం అన్నమే తినేవారు. కాయగూరలనే ఎక్కువగా, అవయినా ఉడకపెట్టితినేవారు. ముతక ఖద్దరు తప్ప మరే బట్టలు ధరించేవారుకారు. ప్రభుత్వపరంగా అనవసరంగా ఒక్కరూపాయినయినా ఖర్చుపెట్టడానికి అంగీకరించేవారుకారు. మద్రాస్ నగరంలో మైసూరు రాజా వారి భవనం ఉండేది. ఆ భవనాన్ని మద్రాస్ ప్రభుత్వానికి అమ్మాలని మహారాజుగారు అన్నారు. భవనాన్ని ప్రభుత్వానికి వాడండి. ప్రభుత్వానికేకాదు మీరు కూడా వుండడానికి అన్ని వసతులు వున్నాయి అని రాజాగారు చెప్పారుట. ఇంత ఖర్చుపెట్టి కొన్న భవనంలో వుండవలసిన అవసరం లేదు. ప్రభుత్వానికిలేదు అన్నాను. ఇంతకీ ఆ భవనం ఖరీదు ఐదులక్షల రూపాయలు. ఇప్పటి మంత్రులు మహేంద్ర భవనాలలోని నివాసాలను చూస్తున్నప్పుడు రామస్వామిరెడ్డి వంటివారు ఎంత ఆదర్శవాదులో అర్థం అవుతుంది. అన్నామలై విశ్వవిద్యాలయం ఆయనకు గౌరవ డాక్టరేటును ఇవ్వజూపింది. ఇందుకు తను అర్హుడనుకానని తిరస్కరించారు.

మధురైలో కంటి ఆపరేషన్ చేయించుకున్నారు. ఇప్పటి రాజకీయ ప్రముఖులు పడిశం పడితే అమెరికాకు వెళ్ళి చికిత్స చేయించుకునే పద్ధతి వుండేదికాదు. అంతేకాదు ఆస్పత్రికి వెళ్ళడానికి మిత్రులు టాక్సీని కుదిర్చినా, నడచి వెళ్ళగలను అని నడచి వెళ్ళారుట. కరుణానిధి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఆయన వైద్య ఖర్చులన్నీ ప్రభుత్వం భరిస్తుందని ప్రతిపాదించారు. ప్రభుత్వ ఖర్చుతో వైద్యం చేయించుకోవలసిన అవసరం లేదని ఆయన అందుకు తిరస్కరించారు.

ఎట్టి డబ్బుకొరతలేని మాజీ ప్రధానమంత్రుల వైద్యానికి ప్రభుత్వం ఏటా అనేక కోట్లరూపాయిలు ఖర్చుపెడుతున్నాయి. ప్రభుత్వ సహాయం పొందడానికి ఆరునెలలు ప్రధాన మంత్రులుగా వున్నవారు ఆరాటపడు తుంటారు. ఆయన ముఖ్యమంత్రిగా వున్నప్పుడు మద్రాస్ రాష్ట్రానికి భావనగర్ రాజాను గవర్నర్‌గా నియమిస్తున్నానని మీకేమయినా అభ్యంతరమా అని ప్రధానమంత్రి నెహ్రూ అడిగారుట. హోంమంత్రి సర్దార్‌పటేలు ప్రతిపాదన పుంపుతేనే అంగీకరిస్తానని ప్రతిపాదన హోంమంత్రి నుంచి మాత్రమే రావాలని ఆయన ధైర్యంగా చెప్పారు.

రామస్వామిరెడ్డియారు ఆధ్యాత్మిక చింతనాపరులు. రమణ మహర్షి భక్తుడు. ముఖ్యమంత్రిగా వున్నప్పుడు కూడా ప్రతిదినం కూడా క్రమం తప్పక నిత్యం పూజలు చేసుకునే వారు. ఎన్ని ఒడుదుడుకులువచ్చినా రామస్వామిరెడ్డి కాంగ్రెస్‌ను అంటిపెట్టుకునివున్నారు. కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీలో చేరమని ఆచార్య కృపలాని స్వతంత్ర్య పార్టీ చేరమని రాజాజీకోరినా ఆయన సునిసితంగా తిరస్కరించారు.

## దివ్యమంగళమూర్తి, భవ్యతేజస్ఫూర్తి

"సాయీ బలిమి చెంత జగతి బలమదెంత
పర్తి పురీశుని వైభవాన
అమ్మల గన్నమా అమ్మ సాయీమాత
దర్శనానందమే తాపహరము
భగవదార్తి కలుగు భక్తుల హృదయని
వాసిగా వెలుగొందు ప్రభువరుండు
దివ్యమంగళమూర్తి భవ్యతేజస్ఫూర్తి! కరగని తరగని
కాంతి పరిధి వేద పురుషుడై వచ్చె సర్వేశ్వరుండు
సత్యసాయీస్వరూప ప్రశాంతమూర్తి
మహితలీలావతార ప్రభావమరసి
అర్చనలు సల్పరండోయి! యార్యులార"

- పంచాంగము శ్రీనప్పశాస్త్రి

# బెంగాలీ బాబా

రాజస్థాన్‌లోని ఒక పల్లెలో ఒక రైతుండేవాడు. అతని కొడుకు పెద్ద జ్వరం వచ్చిపోయాడు. వాళ్ళ కులంలో ఆడవాళ్ళకు మారుమనువు ఆచారం వుంది. దయానంద సరస్వతి స్థాపించిన ఆర్యసమాజ్ కార్యకర్తలు కొందరు వచ్చి ఆ అమ్మాయిని మళ్ళీ పెళ్ళి చేసికొనమని ప్రోత్సహించారు. అయినా ఆ అమ్మాయి వొప్పుకోలేదు. అందులో ఒకరా పిల్లకు బెంగాలీ బాబా ఫోటోనొక దానినిచ్చి వెళ్ళాడు. ఆ అమ్మాయి తన గదిలో బెంగాలీ బాబా ఫోటో, తన భర్త ఫోటో వుంచుకొని, ఎప్పుడూ భగవధ్యానంలో వుండేది. ఆమె గది మిద్దెపైన గది.

ఆమె ఎంత పవిత్రంగావున్నా ఆ వూళ్ళి కుర్రకారు మాత్రం ఆమె మానాన ఆమెను వదిలేవారుకాదు. ఏదో ఒక రకంగా ఆమె పట్ల అసభ్యంగా ప్రవర్తించే ప్రయత్నం చేస్తుండేవాళ్ళు. కాని ఆమెమాత్రం వారివైపు కన్నెత్తి అయినా చూసేదికాదు. దాంతో వారికి ఆమెపై కక్ష పెరిగింది. ఏ విధంగానైనాసరే ఆమె శీలాన్ని దోచుకోవాలనే పట్టుదల పెరిగింది. ఒకరోజు రాత్రి ఆ కుర్రాళ్ళొక తుపాకీ తీసికొని ఆ ఇంటిపై పడ్డారు. ఆమె మామగారినీ, అత్తగారినీ కట్టిపడేసి మిద్దెపైకి వెళ్ళబోయారు.

మిద్దెపై గల గదిలో ఆమె తలుపు బిగించుకొని 'గురుదేవా! రక్షించు' అని అదేపనిగా ప్రార్థించటం మొదలు పెట్టింది. ఆ గదికి ఉన్న తలుపొక్కటే దుండగులు వస్తున్న మెట్లతలుపే. మరోదారి లేదు. బయటి వేపాక కిటికీ వుంది. అటువైపు నుండి దిగాలంటే తాడు వేసికొని దిగాలి. కాని అటు కూడా ఆ దుండగుల సావాసగాళ్ళు కాపలా వుండే వుంటారు. ఇంతలో బయటి కిటికీ నుండి వొక తల కనపడింది. 'అమ్మాయీ! ఈ కిటికీకి చువ్వలు లేవు. నీవిటురా' అని పిలిచింది. పిల్ల తలెత్తి చూసింది. తన ఎదురుగా వున్న ఫోటోలోని వ్యక్తి తలకాయ తనకు ప్రత్యక్షంగా కిటికీలోంచి కనిపిస్తోంది. ఆమె వెంటనే లేచి కిటికీలోంచి దూరి బయటకు పోయింది. బాబా ఆమెను పట్టుకొని, తానెక్కివున్న ఒంటెపైకి చేర్చి, బయలుదేరి వెళ్ళసాగాడు. అంతవరకు అక్కడ కాపలావున్న దుండగులెవరూ ఆమెకు కనిపించలేదు.

ఆమె కిటికీ నుండి బయటకు దూరిన మరుక్షణం దుండగులు తలుపులు పగలగొట్టి లోపలకు వచ్చారు. కాని గదంతా శూన్యం! వాళ్ళు కిటికీలోంచి క్రిందికి చూశారు. అక్కడ తమ స్నేహితులు కాపలావున్నారు. వాళ్ళనడిగితే అటెవరూ రాలేదు. పోలేదని వాళ్ళు చెప్పారు.

**భండారు పర్వతాలరావు**

బెంగాలీ బాబా అలా ఆమెను రక్షించి ఆమె పుట్టింటికి సురక్షితంగా చేర్చారు. మెట్టినింటి నుండి ఆమె తెచ్చుకున్నదల్లా వంటిపై బట్టలు, రెండు ఫోటోలు.

*(శ్రీరామ రచించిన 'హిమాలయ యోగులు' ఆధారంగా...)*

**శాంతిధర్మప్రదాయి ! శ్రీ సత్యసాయి!**

"దైవప్రీతిని పొంద ధర్మప్రధిత మార్గ
మాచరించినఁజాలు నన్యమేల
పాపభీతిని కల్గి పరహితమ్మునను గోరు
నాతండె జగతి సద్యశము బడయు
సంఘనీతి తలంచి సర్వదా చరించు
నాతఁడే యుత్తమ ఖ్యాతినొందు
క్రమశిక్షణారీతి గట్టిగా పాటించు
నాతఁడే సత్కీర్తికాటపట్టు
సద్గుణ మొకండు స్థిరముగా జగతిగొనిన
వాడు సజ్జన సంస్తుతిఁబడయుఁగాదె
చెడుగుణంబులు విడువంగఁజేయుమయ్య
శాంతిధర్మప్రదాయి! శ్రీ సత్యసాయి!"

- కొలచన వెంకట రమణమూర్తి

# భక్తుల రక్షణే భగవంతుని ప్రధాన లక్ష్యం!

"భక్తిరేవ పరమార్థగాయిని
భక్తిరేవ భవరోగనాశిని
భక్తిరేవ పరమార్థదాయిని
భక్తిరేవ పరమోక్షకారిణీ"

ప్రేమస్వరూపులైన విద్యార్థినీ, విద్యార్థులారా!

ప్రాచీన కాలము నుండి భారతదేశము ఆధ్యాత్మిక తత్త్వ ప్రభావముతో, యావత్ ప్రపంచమునకూ భక్తిని చాటుతూ వచ్చింది. 'భక్తి' అనగా కేవలము జపము, ధ్యానము, పూజలు, పురస్కారములు - ఇత్యాది అంగములుకావు. భగవంతునిపైగల ప్రేమయే 'భక్తి'. కర్మఫల సంసర్గముచేత కలుషితముకానటువంటి యొక్క నిశ్చల, నిర్మల, నిస్వార్థమైనటువంటి ప్రేమనే భక్తి. ఇట్టి ప్రేమకు ఎట్టి నిబంధనలూలేవు. ఎట్టి హద్దులూలేవు. మానవుని నుండి ఆవిర్భవించినటువంటి నిజమైనటువంటి ప్రేమతత్త్వమే ఈ భక్తి. ఎట్టి వాంఛలచేత కలుషితముకానటువంటి ప్రేమనే భక్తి. వాంఛలతో కూడినటువంటి ప్రేమ భక్తికానేరదు. అయితే భగవత్ వాంఛలు తప్ప, ప్రాకృతమైన వాంఛలు ఉండరాదు. అప్పుడు భక్తుల హృదయము నుండి ఆవిర్భవించేటటువంటి ప్రేమతత్త్వము సరాసరి దైవమునకే చెందుతుంది. కష్టసుఖములయందుగాని, ఆనంద దుఃఖములయందుగాని, ఇది ఏ మాత్రమూ మార్పు చెంద కూడదు. ఈ విధముగా ఏకాత్మభావంతో సాధించినవాడు పాండవ అగ్రజుడైన ధర్మజుడు. తన పత్ని అయిన ద్రౌపదికి నిండు సభలో అవమానం జరిగినప్పటికినీ తాను ఏమాత్రం చలించలేదు, విచారించలేదు. తన తమ్ముడు అర్జునుని కుమారుడు అభిమన్యుడు మరణించినప్పుడు కూడా ఏమాత్రం విచారించలేదు. తన గురువు ద్రోణాచార్యుని కుమారుడు అశ్వత్థామ, ఉపపాండవుల గొంతులు కోసినప్పటికినీ ఏమాత్రం విచారించలేదు. రాజభోగము లను విడనాడి కానలకేగి కందమూలాలు తింటునప్పుడు కూడా ఏమాత్రం విచారించలేదు. సర్వకాల సర్వావస్థల యందునూ 'కృష్ణ' నామమును చింతించటంతప్ప, అన్య చింతలకు ఏమాత్రం చోటివ్వలేదు. ఒక్క ధర్మజుడేకాదు, ధర్మజుని ధర్మపత్ని అయి ద్రౌపది కూడా. ఇటువంటి ఏకాత్మభావంతో కృష్ణనామస్మరణ చేస్తుండేది. ఉప పాండవులను చంపిన అశ్వత్థామను అర్జునుడు పట్టుకొని వస్తాడు. భీమార్జుననకులసహదేవులు అశ్వత్థామపైన పడుతుండగా ద్రౌపది అడ్డంగా వెళ్ళుతుంది. తన కొడుకులను చంపిన అశ్వత్థామపై ఏమాత్రం కోపం కూడా చూపదు. సహనాన్ని ప్రదర్శిస్తుంది. కృష్ణతత్త్వాన్ని ప్రపంచానికి చాటింది ద్రౌపది. ఎన్ని కష్టములు వచ్చినా కృష్ణుని ఎన్నడూ దూషించలేదు పాండవులు. నిరంతరం కృష్ణుని ఆరాధిస్తుండేవారు.

## భగవాన్ సాయి దివ్యసందేశం

'భక్తి' అనేది నవవిధమార్గముల ద్వారాను, ఆరాధనల చేతనూ, ఆనంద భజనచేతనూ నిరూపించేటటువంటిది కాదు. హృదయమానస సరోవరము నుండి ఆవిర్భవించే టటువంటి ప్రేమజలమే భక్తి. కనుకనే వేదమునందు "పత్రం పుష్పం ఫలం తోయం సమర్పయామి' అన్నారు. 'పత్రం' అనగా ఆకులలములుకావు. దేహమే ఒక పత్రం. ఈ దేహమనే పత్రము ఎప్పుడు రాలుతుందో? ఎప్పుడు కూలుతుందో? ఎప్పుడు కాలుతుందో? వేసవి వచ్చేటప్పటికీ ఏ విధంగా ఆకులు రాలిపోతుంటాయో, అదే విధంగా కాలం గడిచేటప్పటికీ దేహం కూడా రాలిపోతుంది. కనుక హే భగవాన్! ఈ దేహమనే పత్రమును నీకు అర్పితం చేస్తున్నాను. ఇదే నీకు సరియైన పత్రము. నీవు యిచ్చిన దేహమునే నీకు పత్రముగా సమర్పించుకుంటున్నాను. ఇక 'పుష్పం'. ఏమిటి ఈ పుష్పం. హృదయ పుష్పం. జాజి, మల్లె పుష్పములుకావు. అవన్నీ సాయంత్రానికి వాడిపోయేవే. వాడనటువంటిది నా హృదయపుష్పము మాత్రమే. అది పరిశుద్ధమైనటువంటిది, పరిపూర్ణమైనటువంటిది, ప్రేమతో కూడినటువంటిది. కనుక నా హృదయ పుష్పమును నీకు

సమర్పించుకుంటున్నాను. ఇక 'ఫలం'. నీకు ఏ ఫలం కావాలి? జామ, యాపిల్, ఫలములా? ఆ ఫలములన్నీ ప్రాకృతమైనవే. నా మనసే నిజమైన ఫలము. ఆ ఫలమును నీకు అర్పిస్తున్నాను. అనగా నా మనసును నీకు అర్పిస్తున్నాను. ఇక 'తోయం'. తోయం అంటే పంపు నీరు, బావినీరు, నదినీరుకాదు. నిన్ను చింతిస్తూ, నీ యొక్క లీలలు ఆనందిస్తూ ప్రేమతత్త్వాన్ని అనుభవిస్తూ కార్చే కంటిధారలే ఆనందభాష్పాలు. ఇట్టి ఆనందభాష్పములే నిజమైన తోయం. ఇటువంటివే భక్తులు, భగవంతునికి సమర్పించాలి. భగవంతుడు కూడా ఆశించేది అదే. అంతేగాని క్షణభంగుర మైన పత్రపుష్పఫలములుకాదు.

ఒక పర్యాయం సత్యభామ భౌతికమైన ధనకనక వస్తువాహనాదులతో కృష్ణుని తూచడానికి ప్రయత్నించింది. భగవంతుడు వీటికి తూగుతాడా? తూగలేదు. ప్రేమకు మాత్రమే తూగుతాడు. రుక్మిణి వచ్చింది. కృష్ణా! అంటూ ఒక తులసిదళం వేసింది. కృష్ణనామముతో కృష్ణుని తూచింది. తులసీదళం ఎక్కువ బరువైంది. కనుక భక్తికి చిక్కుతాడు కాని భగవంతుడు, ధనమునకు కాదు. భక్తికంటే మించిన వస్తువు ఈ జగత్తులో మరొకటిలేదు. కనుకనే భారత దేశంలో ప్రాచీనకాలము నుండి భక్తికి ప్రధానమైన స్థానం యివ్వబడింది. భక్తికి మించిన ధనం మరొకటిలేదు. భక్తికి సమానమైన తూకం మరొకటిలేదు.

ప్రతి మానవుని యందు 'షడ్ చక్రములు' ఉంటు న్నాయి. వీటిలో రెండు చక్రములు చాలా ప్రధానమైనటు వంటివి. 1. హృదయ చక్రము 2. సహస్రా చక్రము. ఈ హృదయ చక్రమునే 'హృదయ కమలము' అన్నారు. సహస్రారచక్రమును 'సహస్ర కమలము' అన్నారు. ఈ రెండు చక్రముల యొక్క తత్త్వమును చక్కగా గుర్తించు కున్నప్పుడు, భగవంతుడు వారికి వశుడవుతాడు. ఎనిమిది రేఖలతో కూడినటువంటిది ఈ 'షడ్ చక్రము'. ఒక్కొక్క రేఖకు ఒక ప్రత్యేకత ఉంటుంటుంది. సహస్రార చక్రము పైన ఒక్కొక్క దళముపైన ఒక్కొక్క దళమువాలి వుంటుంది. ఒక్కొక్క దళమునకు కూడనూ షోడశకళలతో నిండివుంటాడు భగవంతుడు. ఈ షోడశకళాపరిపూర్ణు డైనటువంటి భగవంతుడు ఒక్కొక్క రేఖపైన కూడా ఉంటుంటాడు. కనుక వేయి దళములను ఒక్కొక్క దానిని పదహారు దళములతో వెచ్చించినప్పుడు పదహారువేల గోపికలుగా మారిపోయినారు. వీరు భగవంతునికి అర్పితమై పోయినారు. అయితే వీరికి నాయకుడెవరు? భగవంతుడే. ఆ భగవంతుని ఆజ్ఞచేత ఈ దళములను తీసుకోవడానికి ఎవరికైనా అధికారం ఉంటుంది. అయితే భగవంతుని హక్కు అయినటువంటి ఈ దళములను, భగవంతుని ఆజ్ఞలేకుండా పుచ్చుకోవటం ఎవరికీ సాధ్యంకాదు.

ఒక చిన్నఉదాహరణ. సీత భూజాత. ఈమె రాముని పత్ని. ఆమెపై రామునికి సర్వహక్కులూ వున్నాయి. కనకనే అతను సీతకు పతి అయినాడు. కనుక సీతాపతి రాముడు. పతి ఆజ్ఞను తీసుకోకుండా, ఆమెను రావణుడు దొంగిలించు కొని పోయినాడు. ఆమెను, పతి ఆజ్ఞను తీసుకోకుండ, తీసుకోపోవటంచేత రావణుడు ఏమి అనుభవించాడు? అన్ని కష్టములకూ గురియైపోయినాడు. కడకు భార్య మండోదరి కూడా రావణునికి హితవు పల్కింది. 'రావణా! రామచంద్రుడు సాక్షాత్ నారాయణమూర్తి ఈమె సీతా మాత. ఈ పతివ్రతురాలు ఈమెను తీసుకొనిరావటం చాలా పొరపాటు. పొరపాటేకాదు తప్పు కూడాను. రాముని ఆజ్ఞలేకుండా ఈమెను ఎందుకు తీసుకొనివచ్చావు? కనుక ఇప్పుడైనా ఈమెను తీసుకొని వెళ్ళి రామునికి వప్పజెప్పిరా!' అంటుంది. "వినాశకాలే విపరీత బుద్ధిః". అతను ఏ మాత్రం అంగీకరించలేదు. అదే విధముగా ఈ పదహారు వేలమంది గోపికలు కూడనూ, షోడశ కళలతో నిండినటువంటి పరమాత్ముని సొత్తులే. సహస్రార పద్మములన్నీ కూడనూ, అష్టదళములతోకూడినటువంటి ఆకారములే యోగులంతా ఈ అష్టదళములను ఆశ్రయించుకొని, సహస్రార

## విదురనీతి

"న తన్మిత్రం యస్యకోపాద్ బిభేతి
యద్ వామిత్రం శంకితేనోపచర్యమ్
యస్మిన్ మిత్రే పితరీవాశ్వసీత
తద్వై మిత్రం సంగతానీతరాణి"

ఎవడి కోపము వలన భయపడవలసి వచ్చునో, వాడు మిత్రుడు కాజాలడు. ఎవడిని శంకతో కూడిన మనస్సుతో చేరవలసియుండునో, వాడును మిత్రుడుకాడు. ఎవడు తండ్రివలె విశ్వసింపగలిగినవాడో, వాడే మిత్రుడు. ఇతరులు పరిచితులు మాత్రమే.

పద్మములో ప్రవేశించి పరమానందమును అనుభవించారు. ఈ ఆనందము సహస్రార పద్మము నుండే వచ్చింది. కనుక ఈ విధమైనటువంటి దైవత్వాన్ని మనం పొందాలను కున్నప్పుడు, దైవాజ్ఞను మనం పాటించినప్పుడే, సమాన మైనటువంటి, పరిపూర్ణమైనటు వంటి ఆనందం మనకు లభిస్తుంది.

అష్టదళములయందు అష్టరాణులను పెట్టాడు. సహస్రార దళములయందు పదహారువేల గోపికలు ఉన్నారు. అంతా చేరినప్పుడు, అది అంతా కృష్ణుని యొక్క హృదయ కమలమే. కమలములలో అనేక రేఖలుగా వుంటున్నాయి. రేఖలు వేరు కమలము వేరుకాదు. కనుక దైవత్వాన్ని మనం పొందాలనుకున్నప్పుడు, దైవహృదయంలో మనం రేఖలుగా తయారుకావాలి. ఆ రేఖలు ఏ రీతిగా ఉండాలి? కర్మఫల రహితమైనటువంటి యొక్క పరమశాంతమైనటువంటి రూపకంగా ఉండాలి. మీ ప్రేమను అంతనూ ఆ రేఖలలో ఇమడ్చాలి. ప్రేమను నింపుకోవాలి. ఆనందమును అనుభవించాలి.

భక్తులు ఏ విధంగా భగవంతునికి అర్పితం అవుతారో, భగవంతుడు ఆ విధంగా భక్తులకు అర్పితం అవుతుంటాడు. **'యద్భావం తద్భవతి'**. మన ఆలోచనలు ఏ విధంగా వుంటుంటాయో, భగవంతుని ఆలోచనలు కూడా ఆ విధంగానే ఉంటుంటాయి. మనం ఎప్పుడూ **'ఓ భగవంతుడా! ఓ భగవంతుడా!'** అని అనుకుంటుంటే, భగవంతుడు కూడా **'ఓ భక్తుడా! ఓ భక్తుడా!'** అని అనుకుంటుంటాడు. భగవంతుడికి వేరే చింతలేదు. భక్తుల చింతలే. ఈ ఇరువురికి మధ్యలో ఎవరూ ఉండటానికి సాధ్యంకాదు. ఇలాంటి - పవిత్రమైనటువంటి భక్తితత్త్వాన్ని పాండవులు జగత్తుకు వ్యాప్తిగావిస్తూ వచ్చారు. ఎన్ని కష్టములువచ్చినా, ఎన్ని బాధలుపడినా, ఎన్ని అవమానములు భరించినప్పటికినీ వారు కృష్ణనామాన్ని మాత్రం వదలలేదు. కృష్ణనామాన్ని నిరంతరం స్మరిస్తూ, జపిస్తూ, ధ్యానిస్తూ, కాలాన్ని సార్థకం చేసుకున్నారు. వారి జీవితంలో కృష్ణునికి First (ప్రథమ స్థానం), బంధువులు, సైన్యం వగయిరాలను Next, తమరు (పాండవులకు) Last అని భావించుకొని కృష్ణుని ఆరాధిస్తూ వచ్చారు పాండవులు. కౌరవులు అట్లాకాదు. వారే First అని భావించుకున్నారు. బంధువులు Next, కృష్ణుడు వారి దృష్టిలో Last అని భావించినందువలననే Last .. Lost . అయిపోయినారు. అందరూ పతనమై పోయినారు. కనుక ప్రతివాని జీవితంలో దేవుడు First కావాలి. దేవుడు మొట్ట మొదటివాడైనప్పుడే జగత్తునంతనూ మనం ఆశ్రయించ వచ్చును. అసలు దేవుడే లేకపోతే జగత్తు ఎక్కడిది? జ.... గత్... రావటం పోవటమే ఈజగత్. కదిలిపోయేటటు వంటిదే ఈ జగత్. కాని కదలనివాడు, మెదలనివాడు భగవంతుడు ఒక్కడే. అతనొక్కడే శాశ్వతుడు. శాశ్వతు డైనటువంటివాడిని మనం ఆశ్రయించినప్పుడే మనం శాశ్వతమైన స్థానమును పొందగలుగుతాం.

ప్రేమస్వరూపులారా! ఎన్ని జపతపాదులు ఆచరించి నప్పటికినీ, శాశ్వతమైన దైవత్వాన్ని మనం ఆశ్రయించాలి. శాశ్వతమైన దానిని ఆశ్రయించినప్పుడే, మనకు శాశ్వతమైన ఆనందం లభ్యమవుతుంది. అనిత్యమైనదానిని ఆశ్రయించ కూడదు. అసత్యమైనదానిని మనం వరించకూడదు. ఈ జగత్తంతనూ అనిత్యమూ, అశాశ్వతమే. కనుకనే భగవంతుడు గీతలో "అనిత్యం అసుఖం లోకం" అని చెప్పాడు. జగత్తంతా అనిత్యం అసుఖం, నేడు వస్తుంది. రేపు పోతుంది. భగవంతుడు ఒక్కడే శాశ్వతుడు. రాకపోకలు లేనటువంటి రాజమూర్తి కృష్ణుడు. కనుకనే గోపికలు అన్నివిధములా ప్రార్థిస్తూ, ఆరాధిస్తూ, ఆనందిస్తూ జీవితాన్ని గడుపుతూ వచ్చారు గోపికలు. కనుక దైవత్వంలో ఉన్నటు వంటి మాధుర్యము, ప్రేమతత్త్వము ఇట్టిదీ, అట్టిదీ అని

"భక్తితో నిత్యము భజన చేసెడి వార్కి
భక్తి మార్గము చూపు బ్రహ్మవీవు
జ్ఞానివై నిరతమ్ము ధ్యానించు వారికి
జ్ఞాన మార్గము చూపు శంకరుడవు
ధర్మమ్ముతో పలు కర్మలు చేయగ
కర్మ మార్గముచూపు కర్త వీవు
సకలమ్ము త్యజియించి శాంతి చూపెడివార్కి
సన్న్యాస గతి చూపు స్వామి వీవు
సర్వమార్గములకు నుర్విలో గమ్యము
పుట్టపర్తి యనెడి పుణ్యభూమి
సత్యసాయి మనకు సర్వమ్ము సకలమ్ము
మోక్షపథము చూపు ముక్తిదాత"

- *శంభర వెంకట రామజోగారావు, అహ్మదాబాద్*

ఎవరూ వర్ణించలేరు. ఎంతగ్రోలినా అది తనివితీరనటు వంటిది. కనుకనే పాండవులు కృష్ణనామస్మరణలోనే జీవితాన్ని గడిపారు.

భగవంతుడు భక్తమానససంచారి. భక్తసులభుడు. భక్తపరాధీనుడు. ఎలాంటి పరిస్థితులలోను భగవంతుని మరవనటువంటివారికి భగవంతుడు దాసుడవుతాడు. అటువంటి పరమభక్తులు కనుకనే పాండవులు కట్టకడపటి వరకును Happy Life, Healthy Life, Peaceful Life ను గడిపారు. ఎప్పటివరకు? స్వర్గంలో ప్రవేశించేవరకు ఆ విధంగానే ఉన్నారు. కనుక భగవంతుని యొక్క భక్తి మన యందు స్థిరంగా ఉంటే, మనం ఎన్నింటినైనా సాధించ వచ్చును. భగవంతుడు మన వెంట, ఇంట, జంట ఉంటాడు. కృష్ణావతారమందు మనకు అనేకం ఈ రీతిగా కనిపిస్తున్నాయి.

యుద్ధం జరుగుతున్నది. అది తొమ్మిదవ దినం. రేపటి సాయంత్రంలోపల పాండవులను హతమారుస్తానని భీష్ముడు ప్రతిజ్ఞ చేశాడు. అప్పుడు ద్రౌపది చాలా బాధ పడింది. తన పతులను కాపాడమని కృష్ణుని ప్రార్థించింది. కృష్ణుడు మాట యిచ్చాడు. ఆ రోజు సాయంత్రం యుద్ధం ముగిసింది. భీష్ముడు నిద్రపోకుండా తన సైనిక గుడారంలో అటుఇటూ తిరుగుతున్నాడు. ధర్మమూర్తులైన పాండవులను చంపుతానని ప్రతిజ్ఞ చేసినందులకు బాధపడుతూ నిద్రపట్టక అటూ ఇటూ తిరుగుతున్నాడు. రాత్రి పది గంటలైంది. అందరూ నిద్రపోతున్నారు. కృష్ణుడు వచ్చి 'ద్రౌపదీ! ఇప్పుడు నీవు వెళ్ళి భీష్ముని పాదాలపైపడు!' అన్నాడు. ముసుగు వేసుకుని ద్రౌపది వెళ్ళింది. భీష్ముని పాదాలపై పడింది. గాజులు చప్పుడు అయినాయి. ఎవరో స్త్రీ వచ్చిందని భావించి, ద్రౌపదిని చూడకుండానే '**దీర్ఘసుమంగళీభవ!**' అని ఆశీర్వదించాడు భీష్ముడు. ఇంతే నాకుచాలు! అని లేచింది ద్రౌపది. భీష్ముడు చూచాడు. ఆశ్చర్యంతో 'ఏం ద్రౌపదీ! నీవా! ఎందుకు ఇంతవేళ వచ్చావ్? ఎవరు నిన్ను పంపారు? ఎవరు ఈ యుక్తిని బోధించారు?' అని అడుగుతాడు భీష్ముడు. 'తాతగారు! నాకు ఎవరు యుక్తిని బోధించుతారు. తమరు పితామహులు. తమకు తెలియందేమున్నది. నాకు యుక్తిని బోధించేవాడు ఒక్కడే. అతనే కృష్ణుడు'' అని జరిగినదంతా చెబుతుంది ద్రౌపది. చెబుతూ వుండగా కృష్ణుడు వస్తాడు. ఒకప్రక్క ఆనందించాడు భీష్ముడు. ధర్మమూర్తులైన పాండవులను రక్షించడం చాలా మంచిదే అయిందని భావిస్తాడు భీష్ముడు. బాగా అలసిపోయిన భీష్ముడు 'కృష్ణా! నాకు చాలా ఆకలిగా ఉన్నది. తినటానికి ఏమైనా తెచ్చావా? చంకలో ఏదో పెట్టు కున్నావే!'' అని అడుగుతాడు. అప్పుడు కృష్ణుడు 'ఇంత యుద్ధసమయంలో భోజనాలు తీసుకొనిరావటమేనా నాపని. ద్రౌపదిని రక్షించే నిమిత్తమై ఆమె చెప్పులను మోసుకొని వచ్చాను. చెప్పులతో నీ దగ్గరకు వస్తే, చప్పుడు అయి, ముందుగానే ఎవరొచ్చిందో, తెలుసుకుంటావని, ఆమెను చెప్పులు లేకుండా వెళ్ళమని నేనే చెప్పాను' అని చెప్పి చంకలోనున్న మూటను తీయగానే ద్రౌపది రెండు చెప్పులు క్రిందపడుతాయి. భీష్ముని కంటివెంబడి ధారలు కారుతాయి. 'ఎంతటి భక్తపరాధీనుడవు నీవు స్వామీ! ఆమెను రక్షించే నిమిత్తమై, ఆమె భర్తలను పోషించే నిమిత్తమై, ఆమె చెప్పులను కూడా మోసుకొని వచ్చావా? స్వామీ!' అని అంటాడు భీష్ముడు.

భగవంతుడు తన భక్తులను రక్షించే నిమిత్తమై ఎంతటి నీచమైన పనికైనా పూనుకుంటాడు. భగవంతునికి నీచము, ఉచ్చము అనే బేధములేదు. ఎప్పుడు ఏది చేయాలనుకుంటే అది చేస్తాడు. **భక్తుల రక్షణే భగవంతుని** ప్రధాన లక్ష్యము. ఆ విధంగా పాండవులను ప్రతి విషయం లోను కాపాడుతూ వచ్చాడు కృష్ణుడు. పాండవులు కృష్ణుని ఆ విధంగానే ప్రేమతో ఆరాధిస్తూ వచ్చారు. కృష్ణనామాన్ని వారు ఎప్పుడూ విస్మరించలేదు. 'సర్వదా సర్వకాలేషు సర్వత్రా కృష్ణ చింతనం' పాండవుల లక్ష్యం అదే. కృష్ణుడు కూడా అంతే! సర్వదా, సర్వకాలేషు పాండవుల క్షేమమునే కోరేవాడు. కనుక భక్తుల యొక్క హృదయం ఏ విధంగా పరితపిస్తుందో, భగవంతుని హృదయం కూడా ఆ విధంగానే పరితపిస్తుంది. అయితే భగవంతుని యొక్క తత్త్వమును అర్థం చేసుకోవటం చాలా కష్టం. భగవంతునికి చిన్న పని, పెద్ద పని అనే బేధములేదు. భక్తులను రక్షించే నిమిత్తమై ఎలాంటి పనినైనా చేస్తాడు భగవంతుడు. భక్తులే లేకపోతే భగవంతుడెక్కడ? భగవంతుని యొక్క గొప్పతనమును వర్ణించేది భక్తులే. ఇక్కడ యింతమంది చేరారు. ఎందు కోసం వచ్చారు? మీ దగ్గరలేనిది, మీ ఇంటిలో చిక్కనిది, మీ గ్రామంలో దొరకనిది, ఏదో ఒకటి ఇక్కడ ఉన్నది. దానిని పొందే నిమిత్తమై ఇక్కడకు వచ్చారు. అంతేకాని,

రమ్మనమని పిలిస్తే, మీరు రారు. మీలోలేనిది, మీ ఇంటిలో చిక్కనిది, మీ గ్రామంలో దొరకనిది 'సాయిప్రేమ'. ఆ ప్రేమ యిక్కడ వున్నదికాబట్టి, ఆ ప్రేమను పొందటానికి యిక్కడకు వచ్చారు. కాబట్టి మీ దగ్గరలేని దానిని పొందడానికి యిక్కడకు వచ్చారు. దానిని పొంది, తీసుకొని వెళ్ళండి. ఈ ప్రేమను మీ హృదయాలలో నింపుకోండి. కాబట్టి భక్తులే లేకపోతే బాబా ఎక్కడ? బాబా లేకపోతే భక్తులు ఎక్కడ? బాబాకు భక్తులకు సన్నిహిత సంబంధ బాంధవ్యం, ఎడబాయనటువంటి సంబంధం, అవినాభావ సంబంధం, అన్యోన్యాశ్రయము. నాయొక్క ప్రాణమే భక్తులు. భక్తుల ప్రాణమే బాబా. ఇరువురిది ఒకే ప్రాణమే. ఈ భావమును అర్థం చేసుకొని, మీరు ఎక్కడ వుండినప్పటికినీ బాబా రక్షిస్తునే ఉంటాడు. కనుక దైవభక్తు లయినటువంటివారు ఎలాంటి పరిస్థితులయందును ఏ బాధలూ పొందరు. భగవద్భక్తులకు ఏ చేటూరాదు. అయితే వారి హృదయమునందు పవిత్రమైన భావములు వుండినప్పుడే అది సిద్ధిస్తుంది. కాని మధ్యమధ్య గడియారం పెండ్యులంలాగే ఊగిసలాడుతుంటే ఇది చిక్కదు. నిశ్చలమైన, నిర్మలమైన, నిస్వార్థమైన స్థిరత్వంతో కూడినదిగా ఉండాలి. గండ శిలలుగా మీ హృదయాలు ఉండాలి. సముద్రంలో గండశిలలు ఉంటాయి. వాటిని అలలువచ్చి కొడుతుంటాయి. అలలు వదలవు, ఈ శిలలు కదలవు. కనుక మీ హృదయాలు ఆ గండ శిలలుగా ఉండాలి. ప్రపంచంలోవున్న అనేక సమస్యలనే అలలు వచ్చి మిమ్ములను కొడుతూ ఉంటాయి. కాని మీరు కదల కుండా స్థిరంగా ఉండాలి. అదియే నిజమైన భక్తి. కనుకనే "నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం, నిత్యశుద్ధ బుద్ధముక్త నిర్మల స్వరూపిణం" అన్నారు.

ప్రేమస్వరూపులారా! మీరు దేనినైనా వదలవచ్చును గాని దైవాన్ని మాత్రం వదలకండి. దైవాన్ని మాత్రం మరువ కండి. ఆ ఒక్క సత్యమును మాత్రం హృదయంలో భద్రం చేసుకోండి. అదియే మిమ్ములను సర్వవిధములా రక్షించే టటువంటిది.

*(ది. 19-5-2000న వేసవి తరగతుల సందర్భమున బృందావనం (బెంగుళూరు)లో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగం నుండి)*

గ్రంధసమీక్ష

## ఓం నమో శ్రీ నారసింహాయ

శ్రీ నరసింహస్వామికి సంబంధించిన వివిధ అంశాలను ఒకచోటకు చేర్చి, వీలయినంత సమగ్రంగా వెలువరించాలన్న బృహత్పథకంలో మొదటి సంపుటం 'ఓం నమో శ్రీ నారసింహాయ'ను శ్రీ వేదభారతి వారు ప్రచురించారు. భాగవతగాథ ననుసరించి ప్రహ్లాద చరిత్రను దీనిలో వివరించారు. రచన తేటతెనుగులో, సమకాలీన సామాజిక పరిస్థితుల విశ్లేషణతో సాగింది. ప్రధాన కథాభాగాన్ని భక్తులు పారాయణ చేసికొనేందుకు అనువుగా నిత్యపారాయణ గ్రంధంగా మలచటం ఎంతో ఉపయుక్తంగా వుంది. ఈ పథకం ప్రధానంగా పరిశోధనాత్మకం. కనుక దాదాపు 30 గ్రంధాల నుండి సేకరించిన నృసింహావతార కథాంశాలను, ఆయా పదాలవివరణలనూ, ఉపయుక్త గ్రంధసూచికతోపాటు విడిగా ఇచ్చారు. రచన భక్తి స్ఫూరకంగా వుంటూ, అచ్చు వయసు మళ్ళినవారు చదువు కునేందుకు హాయయిన ఫాంటులో ఉండటం భక్తపాఠకులకెంతో సౌకర్యంగా వుంటుంది. యాదగిరి గుట్ట, సింహాచలం, అహోబిల నారసింహులవి, షిరిడీసాయి, సత్యసాయిబాబా, అమ్మపర్తి క్షేత్రాల వర్ణచిత్రాలు అదనపు ఆకర్షణ.

శ్రీశ్రీశ్రీ త్రిదండి రామానుజ చినజీయర్ స్వామి, శ్రీ వి.వి. శ్రీధర్ గురూజీ, ఆనందఘన డా॥ అరిపిరాల విశ్వం, ప్రెస్ అకాడమీ అధ్యక్షులు శ్రీ పాతూరి వెంకటేశ్వరరావులు ఆశీరభినందన పూర్వకంగా ఇచ్చిన పరిచయాలు గ్రంధపు విలువను మరింతగా పెంచుతున్నాయి. శ్రీ పాతూరి చెప్పినట్లు "ఇది పండితుల ఆదరణనూ, ప్రజల అభిమానాన్ని పొందుతుంద"ని ఆశించవచ్చు.

- వాణీ, బి. వెల్దుర్తి

సంకలనకర్త : భండారు పర్వతాలరావు
ప్రచుణ : శ్రీ వేద భారతి, హైదరాబాద్
పుటలు : 350
వెల : రు. 50/-
ప్రతులకు : యాదగిరి గుట్ట దేవస్థానం, సింహాచల దేవస్థానం





# నీచునికి ఉపకారం చేస్తే అపకారమే



"ఉపకారేణ నీచానా
మపకారో హి జాయతే
పయః పానం భుజంగానాం
కేవలం విష వర్ధనమ్"

పాముకు పాలుపోసి పెంచితే, అది విషాన్ని వృద్ధి చేస్తుంది. అలాగే, నీచుడికి ఉపకారం చేస్తేఅది అపకారమే అవుతుంది. పాముకు పాలుపోసి ప్రేమతో పెంచినప్పటికీ, తన సహజ గుణమును ఏదో ఒక రోజు ప్రదర్శిస్తుంది. పాలు పోసిన మనిషినే కాటు వేస్తుంది.

అదేవిధంగా నీచుడిని ఎంత గౌరవించినా, ఆదరించినా, ఆ గౌరవ మర్యాదలను నిలబెట్టుకోలేడు. సహాయం అందించినవాడికే కీడుతలబెడుతాడు. ఎదుటివాడు ఏమైనా ఫరవాలేదని భావిస్తాడు. తన స్వార్థం కోసం ఎదుటివారిని బలిచేయటానికి కూడా ఏమాత్రం వెరువడు. ఇట్టి నీచులకు సహాయం చేయడమంటే 'పాముకు పాలుపోసినట్లు' అని అంటారు. భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఒక పర్యాయం నీచుడిని పాముతో పోల్చారు.

"నీచబుద్ధినెంతనాదరించినగాని
కీడొనర్చువాడికైన
విషమునున్న ఫణిని విపరీతము బెంచ
కాటువేయు నెంత ఘనుడినైన"

అసలు 'నీచుడి' గుణగణాలు ఎట్లా ఉంటాయి? నీచుడుది నీచబుద్ధి. నీచబుద్ధి అంటే సంకుచిత మనస్తత్వం. ఓర్వలేని స్వభావం. తుచ్ఛమైన స్వభావం. తన స్వార్థం కోసం ఎదుటివానిని నిర్దాక్షిణ్యంగా సర్వనాశనం చేయడానికి ఏమాత్రం సంకోచించడు నీచుడు. ఎదుటివాడు బాగుపడు తుంటే అసూయతో చేయరాని ఘోరకృత్యాలు చేయడానికి ఏమాత్రం వెరవనివాడు నీచుడు. పాముతో చెలిమి చేయటం వలన కలిగే ప్రమాదంకన్నా నీచుడితో స్నేహం చేయటం మరింత ప్రమాదాన్ని తెచ్చిబెడుతుంది.

ఒక విధంగా ఆలోచిస్తే పాముకుమించిన పాపిష్టి జీవి మరొకటిలేదు. కాని అట్టి పాముకూడా నాగస్వరం వాయిస్తుంటే తన్మయత్వంతో నాట్యం చేస్తుంది. కాని నీచుని గుణము మాత్రం దేనితోనూ మార్చలేము. ఒకవేళ అటువంటి నీచుని మార్చడానికి ప్రయత్నిస్తే మనలోనున్న మానవత్వం కూడా ఆనాటితో మంటలో కలిసిపోతుంది. కనుక నీచుడికి ఉపకారం చేయటం ఒక విధంగా అపాత్ర దానమే అవుతుంది. అంతేకాదు కోరి అపకారం తెచ్చు కున్నట్లవుతుంది. కనుక నీచుడుకి ఎంత దూరంగా ఉంటే అంత మంచిది. #

- సాయిప్రియ

## అంతరిక్షంలో ఇంకు పెన్ను మామూలుగా రాస్తుందా?

ఇంకు పెన్నులో ఇంకు సరఫరా ఆ వ్యవస్థ కు కేశనాళికీయత అనే ప్రక్రియ ఆధారంగా జరుగుతుంది. ఈ కేశనాళికీయతకు కారణం ఇంకు ద్రవానికి ఉండే తలతన్యత అనే ధర్మం. ఈ ధర్మం వల్ల పెన్నులోని ఇంకు పెన్ను గోడలకు అంటుకుని నాళికకుండే గాడి వెంబడి పాళీ వరకూ దిగజారుతుంది.

ఇంకుకు ఉండే ఈ తలతన్యత ధర్మం వల్ల పాళీ నుండి ఇంకు నిరంతరం కిందికి కారిపోకుండా కాపాడ బడుతుంది. పాళీ చివర ఉండే కొనలు విడేటట్లు పెన్నుపై ఒత్తిడి కలుగజేస్తే ఈ ఇంకు కాగితం పైకి వెడుతుంది.

నాళిక గాడిలోకి ఇంకు వెళ్ళేటట్లు చూసుకోగల్గితే అక్కడ నుండి ఇంకు పాళీకి, కేశనాళికీయత వల్ల వెడుతుంది. అంతరిక్షంలో భారరహిత స్థితి ఉంటుంది. అంటే గురుత్వాకర్షణబలం ఉండదు. అందువల్ల నాళికకు ఇంకు సహజంగా ప్రవహించదు. ఈ ప్రవాహాన్ని ఏదైనా ఒత్తిడి కలుగజేయగల అమరికతో, నాళిక దాకా పంప గల్గితే ఆ పైన కేశనాళికీయత ప్రక్రియవల్ల పెన్ను రాస్తుంది. అంటే అంతరిక్షంలో కూడ పెన్ను రాస్తుందన్నమాట.

- సి.వి. సర్వేశ్వరశర్మ



# అఖిల వ్రతములకెల్ల వరలక్ష్మి వ్రతమెమిన్న



"గత జీవుడగు పతిన్ బ్రతికించి యముగెలిచె
సావిత్రి భారత సాధ్వి కాదె
తన సత్యమహిమచే దావాగ్ని చల్లార్చె
ధృతి చంద్రమతి భారతీయ కాదె
కుల సతీత్వము అగ్నిగుండాన ప్రకటించె
సీత భారత ధరాజాత కాదె
కినిసి దుర్మద కిరాతుని బూది గావించె
దమయంతి భారత రమణి గాదె
సత్యసాగర వేష్టి తక్ష్మాతలమున
భరత జాతి పతివ్రత ప్రభావభాష
సంపన్నత కిది కాదె పంటభూమి
అఖిలవ్రతముల కెల్ల వరలక్ష్మి వ్రతమె మిన్న"

ప్రేమస్వరూపులారా!

ప్రాచీన కాలమునుండి పవిత్రమైన భారతదేశము నందు, గుణవంతులైన స్త్రీ పురుషులు వుండటంచేతనే, రాజ్యము సుక్షేమంగా, సుభిక్షంగా, ఏలుతూ వచ్చింది. భారతదేశమునందు మాతృమూర్తి ప్రధానమైన స్థానం అందుకున్నది. భారతదేశమునందు స్త్రీలకు సుక్షేమాన్ని, సుభిక్షాన్ని, మంగళకరమును అందించడానికి ఏదైనా ఒక ఉపాయమున్నదాయని పార్వతి, ఈశ్వరుని ప్రశ్నించిందట. భారతదేశమునందు స్త్రీలు సుమంగళంగా వర్ధిల్లుతూ, ఆయురారోగ్యములతో అష్టఐశ్వర్యములతో, పుత్రమిత్ర పౌత్రాభివృద్ధిలచేత జీవించాలి. రాణించాలని కోరింది పార్వతి. దీనికి ఈశ్వరుడు కూడా సంతోషించి, ఒక ప్రత్యేకమైన వరప్రసాదము స్త్రీలకు అనుగ్రహిస్తున్నానని చెప్పి 'వరలక్ష్మీ వ్రతము'ను గురించి ప్రబోధించాడు ఈశ్వరుడు.

స్త్రీలు తమ గృహమును గురించి, తమవంశమును గురించి, సుక్షేమాన్ని గురించి, సుమంగళాన్ని గురించి అనేక విధముల పాటుపడుతుంటారు. సమత, సమగ్రత, సమైక్యత, సౌభ్రాతృత్వమును కోరేటటువంటివారు స్త్రీలే. అట్టి స్త్రీలకు తగినటువంటి వరప్రసాదము అనుగ్రహించాలని పార్వతి, ఈశ్వరుని ప్రార్థించినట్లుగా పురాణములు చెబుతున్నాయి. అష్టఐశ్వర్య స్వరూపమైనటువంటి దివ్యత్వాన్ని, స్త్రీలకు అనుగ్రహించేనిమిత్తమై, అనేకమైన వ్రతములను సూచించారు మన ప్రాచీన మహర్షులు. కనుకనే స్త్రీలను 'అష్టైశ్వర్య స్వరూపిణి' అని పిలుస్తూ వచ్చారు. వారి వాక్కే సత్యవాక్కు. వారి హృదయమే శాంతి హృదయము. వారి కర్మలే ధర్మాచరణలు. స్త్రీలకు అష్టఐశ్వర్యములను భగవంతుడు అనుగ్రహించగోరి 'శబ్ద బ్రహ్మమయి' అన్నాడు. రెండవది 'చరాచరమయి'.

## భగవాన్ సాయి సుబోధ

సర్వత్రావ్యాపించినటువంటి తత్త్వమే ఈ స్త్రీతత్త్వము. మూడవది 'జ్యోతిర్మయి', నాల్గవది. 'వాఙ్మయి'. ఐదవది 'నిత్యానందమయి'. ఆరవది 'పరాత్పరమయి'. ఏడవది 'మాయామయి'. ఎనిమిదవది 'శ్రీమయి'. కనుక అష్ట ఐశ్వర్యస్వరూపిణి అయినటువంటి స్త్రీలు, అనేక విధముల లోకమును కాపాడుతూ, కుటుంబాలను సంరక్షించు కుంటూ, జగత్తుకు కళ్యాణమును అందిస్తూ వచ్చారు. కాని ఆధునికయుగము నందు దీనిని విశ్వసించడానికి ఏమాత్రం అవకాశం లేకుండా ఉన్నది.

సత్యవాక్కు చేత, శీలసంపత్తి చేత మరణించిన పతిని సంరక్షించుకున్నది సావిత్రి. అనేకమంది సతీమణులు 'వరలక్ష్మీవ్రతమును' నోచి, ఆమె అనుగ్రహమునకు పాత్రులైనారు. అగ్నిలో ప్రవేశించి, తన పాతివ్రత్యమును నిరూపించు కున్నది పవిత్రురాలైన సీత. ఇదే విధంగా సుమతి, అనసూయలు తమ పవిత్రతను నిరూపించు కున్నారు. ప్రాచీనకాలము నుండి భారతదేశమునందు స్త్రీలు అనేక మహత్తరమైన శక్తులను ప్రకటిస్తూ, అనేక విధములైన ఆదర్శములను అందిస్తూ వచ్చారు.

'ప్రార్థన' సర్వకర్మలకూ మూలాధారం. శాపములను త్రుంచి, పాపములను హతమార్చేటటువంటిది ప్రార్థనే. సూర్యోదయమే కాకుండా ప్రార్థించి, తన భర్త ప్రాణాలను కాపాడుకుంది సుమతి. స్త్రీల హృదయాలు అంత పవిత్రమైనవిగా వుంటాయి. వారి అంతర్భావంలలో ఉన్నటువంటి పరిశుద్ధత అందరికీ అర్థంకాదు. కాని పైపై

చర్యలను మాత్రమే చూచి నిర్ణయాలు గైకొంటుంటారు కొందరు. కుటుంబ గౌరవాన్ని రక్షించుకుంటూ, కుటుంబ మర్యాదలను నిలబెట్టుకుంటూ, తమ వంశాన్ని అభివృద్ధి పరచుకుంటూ వస్తున్న స్త్రీలు భారత స్త్రీలు మాత్రమే. దీనికి మూలకారణము వరలక్ష్మీ వరప్రసాదమే. కోరిన కోరికలను అనుగ్రహిస్తుంది వరలక్ష్మి. స్త్రీలు ఆశించిన వరములన్నింటిని అనుగ్రహించేటటువంటి లక్ష్మి కనుకనే ఆమెకు 'వరలక్ష్మి' అని పేరు. అష్టఐశ్వర్యములను అనుగ్రహిస్తుంది వరలక్ష్మి.

ప్రాచీన కాలము నుండి మన భారతదేశమందు 'ఇల్లాలిని చూచి ఇల్లును చూడు' అనే సామెత వాడుకలో ఉన్నది. అలాంటి పవిత్ర హృదయులైన స్త్రీలు నాటినుంచి, నేటివరకు మన భారతదేశంలో కోకొల్లలు. సీత, సావిత్రి, దమయంతి - వీరందరూ ఈ కోవకుచెందిన పవిత్ర హృదయులే. వీరందరూ వరలక్ష్మి యొక్క వరప్రసాదము చేతనే, ఇంతటి శక్తిని పొందగలిగారు. కనుక 'వరలక్ష్మి వ్రతము'ను నోచుకోవటంచేత మానవులకు అభివృద్ధి, ఆనందం, ఐశ్వర్యం, సిరిసంపదలు ఉంటున్నాయి. అయితే కాలక్రమేణ, ఈనాటి ఆధునిక యుగంలో, ఇటువంటి పవిత్రమైన వ్రతములు నానాటికి తగ్గిపోతూ వస్తున్నాయి. అందువలననే ఈనాడు గృహములలో రానురాను పరిశుభ్రత కూడా లేకుండా పోతున్నది. ఆనాడు గృహలక్ష్మి (House Wife) గృహాలను, గృహపరిసరాలను, గృహంలోని వస్తువులను, పాత్రలను ఎంతో పరిశుభ్రంగా వుంచేది. కారణమేమిటి? వారి హృదయాలు అంత పరిశుద్ధమైనటువంటివి. అయితే ఈనాడు ఎక్కడ చూచినా... మాలిన్యం... మాలిన్యం.... త్రాగేనీరు, పీల్చేగాలి, తినేతిండి-అంతా మాలిన్యం. కట్టకడపటికి మనసే మాలిన్యమైపోయింది.

ఈనాడు మానవులలో ప్రాపంచిక సంబంధమైన వాంఛలు పెరిగిపోతున్నాయి, ఆశలు మితిమీరిపోతున్నాయి. అయితే ఇవి ఉండవలసినవే. కాని వీటికి ఒక పరిమితమనేది ఉండాలి. కనుక మన హృదయాలను చెడ్డ భావాలతో నింపుకోరాదు, ప్రేమతో నింపుకోవాలి. అప్పుడు మన తలంపులు, పలుకులు, చూపులు అన్నీ ప్రేమమయంగా ఉంటాయి. **'సర్వం ప్రేమమయం జగత్'**. ఈనాడు అట్టి ప్రేమ హృదయాలలో లేకపోవటం చేతనే ఈర్ష్యా, అసూయ, ద్వేషాలకు నిలయమైపోతున్నాయి. ఈ దుర్గుణాలు మనలో దేనివలన ప్రవేశిస్తున్నాయి? అరిషడ్వర్గములే దీనికి మూలకారణము. దేహాభిమానం వుండటం వలననే ఇవి మనలో ప్రవేశిస్తున్నాయి. కనుక దేహాభిమానమును అరికట్టుకోవాలి, వాంఛలను తగ్గించుకోవాలి, కోరికలపై అదుపు ఉండాలి. కేవలం తన క్షేమమును గురించేగాక, అందరి క్షేమమును కూడా దృష్టిలో పెట్టుకొని ముందుకు నడవాలి. **'లోకాస్సమస్తా సుఖినో భవంతు'** అనే పవిత్ర మంత్రమును విస్మరించరాదు. ప్రపంచమంతా మానవుని హృదయము పైననే ఆధారపడి ఉంటున్నది. ప్రపంచంలో వున్నటువంటి సర్వశక్తులూ, మానవుని, యందే ఉంటున్నాయి. మన శరీరమే ఒక పెద్ద **'జనరేటర్'** మన మనసే ఒక **'టెలివిజన్'**, మనలోని శబ్దములే **'విద్యుత్ తరంగములు'**. ఈనాడు రేడియోలు, టెలివిజన్లు వచ్చాయి. ప్రాచీన కాలములో ఇవి లేక పోయినప్పటికీ మన మహర్షులు, ఎంతో దూరంగా ఉన్నవాటిని చూడగలిగారు, వినగలిగారు. ఆనాడు వారి మనసే 'టెలివిజన్'గా పని చేసేది. కండ్లు మూసుకొని, తమ దివ్య దృష్టితో చూడగలిగేవారు, చూచింది మనకు చెప్పేవారు. అన్ని శక్తులూ మానవుని యందే ఉంటున్నాయి కాని, బయట నుంచి లభ్యమయ్యేటటువంటివికావు. Reflection of the inner being. Reflection, Reaction, Resound అన్నీ మనయందు ఉండినటువంటివే. ఎదుటివాడిని చూచి, అతను చెడ్డవాడని అంటుంటారు కొందరు. ఆ చెడ్డ అతని లోనిది కాదు. నీయందున్నటువంటి భావములే, అతనిలో Reflect అవుతున్నాయి.

మానవదేహము అత్యంత శక్తివంతమైనది. మనసు శక్తివంతమైన అయస్కాంతం... అది అన్నింటిని, అందరిని ఆకర్షించగలదు. మంచిచెడ్డలు రెండూ మన నుండి వచ్చేటటువంటివేగాని, బయటనుంచి వచ్చేవి కాదు. నీవు అద్దం ముందు నుంచొని నీరూపం చూచుకుంటున్నావంటే, అద్దములో నీరూపం ఉన్నదా? లేదు. నీ ప్రతిబింబమే అద్దములో నీకు కనిపిస్తున్నది. అదే విధముగ ప్రతి దేహమూ పరిశుద్ధమైన మనస్సులో ఉండినప్పుడు పరిశుద్ధమైన అద్దంగా ఉంటుంది. అయితే అన్ని అద్దములూ ఆ విధంగా ప్రతిబింబాన్ని చూపించవు. సామాన్యమైన అద్దములో చూస్తే, ఆ అద్దమునకు అవతల వున్నవి కనిపిస్తాయి. ఆ

అద్దమునకు వెనుక వైపున ఎర్రటి రసాయనము పూసినట్ల యితే, అట్టి అద్దములో నీ ప్రతి బింబము కనిపిస్తుంది. అదే విధంగ మన హృదయమునకు 'ప్రేమ' అనే రసాయనం పూసుకొనినప్పుడు 'రసోవైసః' అదే దైవత్వము. అందు వలననే ఉపనిషత్తులు 'రసోవైసః' అన్నారు. రసమనగా ఎట్టిది? పానకంలో పంచదార కలిసి నటువంటిది. పానకము వేరు, పంచదార వేరు చేయటానికి వీలు కాదు. పంచదార లీనం కావటం చేతనే పానకంగా మారిపోతుంది. అదే విధముగ ఈ 'ప్రేమరసము' అనేది పూసినప్పుడు, అన్నీ ప్రేమగానే కనిపిస్తాయి. ఇట్టి పవిత్రమైన ప్రబోధలు గావించే నిమిత్తమై 'వరలక్ష్మీ వ్రతము' ను పూనుకున్నాడు ఈశ్వరుడు. దీనిని పవిత్రమైన స్త్రీ జాతికి చాటి వారి కష్టనష్టములను, బాధలను అన్నింటినీ రూపుమాపి శాంతి సౌఖ్యసంతోషములను అందించమని పార్వతిని కోరాడు ఈశ్వరుడు. ఈ వ్రతమును చేసుకోవటం ఎంతో అదృష్టము. కాల కర్మ కారణ కర్తవ్యాలు చేరినప్పుడే, మన అభీష్టము కూడా నెరవేరుతుంది. ఒక్క తమలపాకు నమిలితే తాంబూలం అవుతుందా? ఒక్క వక్కను నమిలితే తాంబూల మవుతుందా? ఒక సున్నం నోటిలో వేసుకుంటే నోరు పొక్కుతుంది. ఈ మూడింటిని కలిపి నమిలినప్పుడే తాంబూలమవుతుంది. ఆకు పచ్చగాను, సున్నం తెల్లగాను, వక్క బ్రౌన్‌గా ఉంటుంది. ఈ మూడింటి యొక్క ఏకత్వం చేతనే నోరు ఎర్రగా అవుతుంది. కనుక ఈ మూడింటిని నీ హృదయమునందు పవిత్రమైన భావంతో వుంచుకొని నప్పుడు, పవిత్రమైన బ్రహ్మభావము నీలో ఆవిర్భవిస్తుంది. సున్నం లేకపోతే రుచిరాదు, ఎరుపురాదు. కనుక సున్నం కావాలని అధికంగా వేసుకుంటే నాలుక ప్రాక్కిపోతుంది. దానిని కూడా పరిమితంగా తీసుకోవాలి. కనుకనే **'నశ్రేయోనియమం వినా'** అన్నారు. కనుక ప్రతిదానికి ఒక పరిమితం ఉండాలి. నీ దేహంలో 98.4 డిగ్రీలు వేడి వుంటే నీవు ఆరోగ్యంగా ఉంటావు. ఏమాత్రం పెరిగినా జ్వరం ప్రారంభ మవుతుంది. అదే విధంగా 'రక్తపుపోటు' కూడా అదుపులో ఉండాలి. పెరుగకూడదు, తగ్గిపోకూడదు. ఏది కొంచం పెరిగినా, తరిగినా రోగంగా మారిపోతుంది. అదే విధముగా మన మాటలు కూడా ఒక పరిమితంలో ఉండాలి. చేసే పనులు కూడా పరిమితంగా చేయాలి. మన శక్తికి తగినట్లుగా మనం పనులు చేయాలి. దీనికి తగినటువంటి 'క్రమశిక్షణ' కూడా అవసరం. క్రమశిక్షణ అంటే ఏమిటి? ఎప్పుడు? ఎక్కడ? ఏ విధంగా చేయాలి? అప్పుడే ఈ ప్రకృతి మనకు సంతోషాన్ని అందిస్తుంది. పరిమితులు లేకుండా క్రమశిక్షణ లేకుండా పనులు చేస్తూపోతుంటే, అనేక విధములైన కష్టనష్టములు సంభవిస్తాయి. కనుక ఏ వ్రతములు చేసినా, పవిత్రమైన భావములతో, చిత్తశుద్ధితో, ఏకాగ్రతతో, హృదయాన్ని అంకితం చేసినప్పుడు ఎంతటి ఫలమైనా మనకు లభిస్తుంది. భగవదానుగ్రహం చేత మనం ఏపనినైనా చేయగలం, చేయలేని పని అంటూ ఏదీలేదు. ఎంతటి కఠినమైన పనినైనా మనం సులభంగా సాధించ వచ్చును.

అయితే అన్నింటికీ పవిత్రమైన హృదయమే మూల కారణం. కనుక హృదయమునుండి పవిత్రమైన ప్రార్థనలు రావాలి. అనవసరమైన పిచ్చి పిచ్చి మాటలు మాట్లాడ కూడదు. లోకుల విషయాలు మాట్లాడిన మనకు వచ్చే ఫలితమేమిటి? అనవసరమైన ఇతరుల మాటలు వింటే వచ్చే ప్రయోజనం ఏమిటి? ప్రయోజనం లేకపోగా, మనం తలంచిన మాటలు సిద్ధించవు. పరుల సుద్దులను నీవు వదిలినప్పుడే, నీ కార్యం నీకు సిద్ధిస్తుంది.

ప్రేమస్వరూపులారా!

ఈ వ్రతములు ప్రాచీనకాలము నుండి ఎంతో పవిత్రమైన భావాలతో అభివృద్ధి అవుతూ వచ్చాయి. కాని, ఈనాడు అట్టి పవిత్రమైన వ్రతముల మీద నమ్మకాలు లేకుండా పోతున్నాయి. అపవిత్రమైన వాటిమీద నమ్మకాలు ఎక్కువైపోతున్నాయి. అనిత్యం, అసత్యం, అశాశ్వతమైన వాటిమీద నమ్మకాలు పెరిగిపోతున్నాయి. కనుక మనం ఈనాడు హృదయాన్ని మార్చుకోవాలి. **'హృదయవాసి'** భగవంతుడు అనే నమ్మకాన్ని పెంచుకోవాలి. కనుక భగవద్గీత **"దేహోదేవాలయ ప్రోక్తో జీవో దేవస్స నాతనః"** అని చెప్పింది. **దేహమే ఒక దేవాలయం. జీవుడే అందులో దేవుడు. దేహమే దైవమందిరం. కాబట్టి ఈ దేహమును దేవాలయముగా గౌరవించండి. ఎవరి దేహాన్నయినా దేవాలయముగానే పరిగణించండి. ఏ జీవు న్నయినా దేవుడిగానే భావించండి. ఈ విధంగా భావించు కున్నప్పుడు జగడాలకు, కల్లోలాలకు, కలహములకు తావే**

వుండదు. ఈనాడు నీవు వేరు, నేను వేరు అనే స్వార్థ స్వప్రయోజనాలు అధికం కావటం చేత ఈ కలహములు, కల్లోలములు అధికమైపోతున్నాయి. వీటిని రూపుమాపు కోవాలంటే, నైతిక విలువలను పెంపొందించుకోవాలి. ధార్మిక ఆచరణకావాలి, ఆధ్యాత్మికమును ప్రేమించాలి. నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక - ఈ మూడింటి సమ్మిళిత స్వరూపమే మానవ జీవితము. ఈ మూడింటిని అభివృద్ధి గావించుకొనినప్పుడే మానవత్వం సుఖాన్ని పొందుతుంది.

అయితే ఈనాడు ధనమునకు ప్రాముఖ్యత యిస్తున్నారు. అది మంచిది కాదు. నైతిక విలువలకు ప్రాముఖ్యత యివ్వాలి. 'Money comes and goes, But Morality comes and Grows' ధనము వస్తుంది, తరిగిపోతుంది. కాని నీతి వచ్చిన పెరుగుతుంది. ధనం తరుగుతుంది, నీతి పెరుగుతుంది. ధనము ఏనాటికీ శాశ్వతము కాదు. ఇది కదిలిపోయే మేఘముల వంటిది. కాని ధనము కూడా కావల్సిందే. ధనం లేకుండా ఈ జగత్తులో జీవించలేము. కనుక కలియుగ ప్రారంభం నుండి **'ధన మూలం ఇదం జగత్'** అన్నారు. అంతకు పూర్వం **'ధర్మమూలం ఇదం జగత్'** అన్నారు. అయితే ఈనాడు ధర్మము పోయింది. కనుకనే ఈ ధనము వచ్చింది వచ్చినట్లుగా పోతున్నది. ఇంకా ఎక్కడ మనకు సంతోషం? ఎక్కడ ఆనందం? ఎక్కడ సౌఖ్యం? ఎక్కడ సౌభాగ్యం? అయితే మనకు సౌభాగ్యం కావాలి. సౌభాగ్యం, సౌశీల్యము నుంచే వస్తుంది. ఈ సుమంగళత్వం దీని నుండే రావాలి. కనుకనే మన ప్రాచీన ఋషులు ఎన్నో విధముల స్మరించి, పవిత్రమైన భావములతో ఆశీర్వదించే వారు.

శ్రీ కృష్ణుడు ఆనాడు స్త్రీలను పవిత్ర హృదయంతో ఆశీర్వదించాడు. గృహలక్ష్మి, ఇల్లాలు, ధర్మపత్ని, అర్ధాంగి - ఇలాంటి గొప్ప బిరుదులిచ్చి ఆశీర్వదించాడు. **"సున్వంతు విశ్వే అమృతస్యపుత్రః"** అన్నాడు. ఇవన్నీ చాలా పవిత్రమైన టువంటివి. ఇంతటి బిరుదులను పొందిన స్త్రీలు ఎలా తక్కువ వారవుతారు? కాని ఈనాటి కలి ప్రభావం చేత స్త్రీలను పనికత్తెలుగా చూస్తున్నారు పురుషులు. ఇది చాలా పొరపాటు. స్త్రీలను ఎంత గౌరవిస్తుంటే, అంత గౌరవం మీకు కూడా చిక్కుతుంది. స్త్రీల కంటిధారలు కారకూడదు. పురుషులు స్త్రీలను గౌరవిస్తూరావాలి. ఎక్కడ స్త్రీల కంటి ధారాలు కారుతుంటాయో; ఆ గృహములు కష్టములకుగురి అవుతుంటాయి. కనుక స్త్రీల హృదయాలను నొప్పించ కుండా పురుషులు సంచరించాలి. ముల్లు గుచ్చుకుంటే తీసివేయవచ్చును. కఠినమైన మాటలు హృదయానికి గుచ్చుకుంటే, తీయటానికి వీలుకాదు. కనుక కఠినమైన మాటలు మాట్లాడకూడదు. మృదుమధురంగా మాట్లాడటం నేర్చుకోవాలి. తప్పుచేస్తే సరిదిద్దే హక్కు నీకున్నది. కాని కఠినమైన మాటలు మాట్లాడటానికి నీకు హక్కులేదు. వినయంగా, మధురంగా స్త్రీలతో మాట్లాడండి. అప్పుడే వారి యొక్క హృదయము, నీ యొక్క గృహం చాలా సౌభాగ్యంగా వర్ధిల్లుతుంది.

కోపము చాలా చెడ్డది. ఒక్కసారి కోపం వస్తే, మూడు నెలలు భుజించడం వలన వచ్చిన శక్తి భస్మీపటలం అయి పోతుంది. కోపం చేత మన దేహములోని రక్తం ఉప్పొంగి పోతుంది. వేడి ఎక్కుతుంది. ఆ వేడి ఎక్కిన రక్తం చల్లారడానికి మూడు నెలలు పడుతుంది. ఒక వేళ వెంట వెంటనే కోపం వస్తే అది అనారోగ్యానికి దారి తీస్తుంది. జరాసంధుని చంపడానికి అనేక పర్యాయములు వెళ్ళాడు కృష్ణుడు. ఒకేసారి చంపటం చేతకాక కాదు. ఒకసారి వెళ్ళేటప్పటికి, జరాసంధునికి కోపం వచ్చేది. తిరిగి పరుగెత్తుకొని వచ్చేవాడు కృష్ణుడు. మరల కొంతకాలానికి వెళ్ళటం, మరల జరాసంధునికి కోపం రావటం జరిగేది ఈ విధంగా చాలా పర్యాయములు చేయటంచేత కృష్ణుని ఒక పర్యాయం తన సోదరులు, మిత్రులు ప్రశ్నించారు. అప్పుడు కృష్ణుడు "అతనికి భయపడి, నాకు చేతకాక తిరిగి రావటం కాదు. వాడిని చంపటం ఇప్పుడు మంచిదికాదు. చంపాలంటే యుద్ధం చేయాలి. యుద్ధం చేయకుండా, వాడిని చంపుతున్నాను. ఈ విధంగా పలుపర్యాయములు వాడి దగ్గరకు వెళ్ళటం వలన, వాడికి కోపం వస్తుంది. ఈ విధంగా కోపం వచ్చీ... వచ్చీ.... వాడి దేహము కట్ట కడపటికి బలహీనమైపోతుంది." అని చెప్పాడు. అదే విధంగా ఆఖరి సారి కృష్ణుడు వెళ్ళేటప్పటికే జరాసంధుని దేహము కూలిపోతుంది. అనగా వెంట వెంట కోపం రావటం వలన, రక్తము మరిగిపోయి దేహం బలహీనమైపోతుంది. ఆ విధంగా దేహమును బలహీనం చేసి చంపినాడుగాని, బలంతో జరాసంధుని కృష్ణుడు చంపలేదు. జరాసంధుడు మహాబలవంతుడు. **"అంత బలంగలవాడిని మొదట బలహీనునిగావించాలి. బలహీనం చేయాలంటే కోపం**

తెప్పించాలి. ఈ కోపం తెప్పించాలంటే, తాను పోయి యుద్ధం చేసినట్లుగా నటించి, పరుగెత్తుకొని రావాలి. ఇది నాకు అవమానం కాదు. శత్రువును చంపటానికి కొంత చాతుర్యమును కూడా ప్రదర్శించాలి. అదే నేను చేశాను" అని చెబుతాడు కృష్ణుడు. భగవంతునికి అన్నీ తెలుసు. ఎప్పుడు? ఏ విధంగా ప్రవర్తించాలో అతనికి తెలుసు. ఎప్పుడు యుక్తులు పన్నాలో తెలుసు. ఎప్పుడు యుద్ధం చేయాలో, ఎప్పుడు యుక్తిని పన్ని చంపాలో ఆయనకు బాగా తెలుసు. ఏ ప్లాను వేసినా ఇతరుల మంచి కోసమే వేస్తాడు. తనకోసం ఏమీకాదు.. ఏది చేసినా ఇతరుల కోసమే చేస్తాడు భగవంతుడు. దీనిని అర్థం చేసుకోలేక ఏదో మాట్లాడుతుంటారు. మంచి, చెడ్డలు రెండూ ఇతరుల కోసమే భగవంతుడు చేసేది ఏదీ చెడ్డది కాదు. కాని చూచే వారికి ఆ విధంగా చెడ్డదిగా కనిపిస్తుంది. అది వారి యొక్క దృష్టి దోషమే, సృష్టి దోషము కానే కాదు. కనుక భగవంతుడు ఏది చేసినప్పటికినీ ఉపకారమే చేస్తుంటాడు, పవిత్రతనే చేస్తుంటాడు, పవిత్రతలోపల ఒక విధమైన 'ప్రాప్తి' ని కూడా అందిస్తుంటాడు.

కనుక ఈ 'వరలక్ష్మి వ్రతము' యొక్క ప్రభావం ఏమిటి? ఈ వ్రతమును స్త్రీల చేత ఆచరింప జేయించి, ప్రపంచానికి సుభిక్షాన్ని అందించటమే ఈశ్వరుని సంకల్పం. ఈ వరలక్ష్మి వ్రతము వలన ఏమవుతుంది? **దీర్ఘసుమంగళీభవ!' 'పుత్రమిత్ర పౌత్రాభివృద్ధిరస్తు!' 'ఐశ్వర్యాభివృద్ధిరస్తు!' 'ధనం ధాన్యం పశుం బహుపుత్ర లాభం!' 'శతసంవత్సరం దీర్ఘమాయుః'** అనే దీవెనలు వ్రతమాచరించినవారికి లభిస్తాయి. శుభం కలుగుతుంది. వంశాభివృద్ధి అవుతుంది. దేశం సుక్షేమంగా, సుభిక్షంగా ఉంటుంది. అందువలన ఈశ్వరుడు స్త్రీలచేత ఈ వ్రతమును ఆచరింపజేయమని పార్వతికి చెప్పాడు. ఈ వరలక్ష్మి వ్రతము నోములు నోచిన తరువాతనే సావిత్రి, అనసూయ, సుమతి వీరందరూ సుఖసంతోషాలను పొందుతూ వచ్చారు. కనుక మనలో నున్న దోషాలను పరిహారంగావించి, పవిత్రతను అభివృద్ధి పరచి, దివ్యత్వాన్ని అందించటమే ఈ **'వరలక్ష్మివ్రత'** ప్రభావము.

కరములకు అందము బంగారు గాజులు, కంఠమునకు అందము హారములు (నెక్లెస్ లాంటివి). కాళ్ళకు అందం అందెలు. కర్ణముల (చెవులకు)కు అందం కమ్మలు. అంతా బంగారు నగలతో శృంగారించబడింది 'వరలక్ష్మి'. కనుకనే ఆమెను 'లోకమాత' అని పిలుస్తూ వచ్చారు. భారతదేశంలో 'మాత' అనే పదమునకు ఎంతో విలువ ఉన్నది. ఎవరికైనా ఏ బాధకలిగిన మొట్టమొదట 'అమ్మా!' అని అంటారు. కాని 'అయ్యా' అనరు. 'అమ్మ' అనే పదము పవిత్రమైనది, శృంగారమైనది, ప్రియమైనది, విలువైనది, శక్తివంతమైనది. కనుక ఆమెనే 'లోకమాత!' ఈ లోక మాతను అమ్మా! అమ్మా! అని పిలుస్తూవచ్చారు ప్రతి ఒక్కరు. మహర్షులందరూ ప్రార్థించారు. ఆమె ఏదిముట్టినా అమృతమయమే. తల్లితండ్రులు కూడనూ తమ బిడ్డను మొట్టమొదట 'అమ్మా!' అని పిలుస్తుంటారు. పిల్లలకు మొట్టమొదట నోటి నుండి వచ్చే పదము 'అమ్మా' 'అమ్మ' అనే పదము వచ్చిన తరువాతనే 'నాన్న' అనే పదము వస్తుంది. కనుకనే భారతీయ సంస్కృతియందు కూడా మాతా, పిత, గురువు, దైవములకు వరుసగా ప్రాధాన్యత యివ్వబడింది. 'మాత'కే ప్రథమస్థానం యివ్వబడింది. తల్లికి వున్న ప్రేమ మరెవ్వరికీ లేదు. అట్టి అమ్మను దూరం చేసుకొనినవారికి ఏమాత్రం భవిష్యత్తు వుండదు. **అమ్మలేని జీవితం చుక్కాని లేని నావవంటిది.** తల్లి వుండినంత వరకు ఎంతో బలం వుంటుంది. తల్లిపోయిన వెంటనే సహజంగా బలహీనమై పోతారు. కనుకనే భారతీయ సంస్కృతి యందు తల్లికి ఇంతటి ప్రాముఖ్యత యివ్వబడింది, ప్రాధాన్యత యివ్వబడింది.

*విద్యార్థులారా!*

తల్లులను గౌరవించండి! తగిన విధంగా మర్యాద లివ్వండి. తల్లి ఆజ్ఞలను శిరసావహించండి. వినయ విధేయతలతో ప్రార్థించండి. తల్లి మనసు సంతృప్తి చెందుతే, లోకమంతా సంతృప్తి చెందుతుంది. తల్లిని గౌరవించినట్లుగానే 'లోకమాత' అయిన సర్వసౌభాగ్యాలను అందించేటటువంటి వరలక్ష్మిని గౌరవించి, పూజించి, ఆశ్రయించి, ఆనందించి, ఆ ఆనందాన్ని పదిమందికి పంచడానికి ప్రయత్నించండి. స్త్రీలు వరలక్ష్మి వ్రతమును చేయటం వలన వారి భర్తల ఆయుః ప్రమాణం కూడా పెరుగుతుంది. కనుక పురుషులు ఈ వరలక్ష్మి వ్రతమునకు అవసరమైన ఉత్సాహ ప్రోత్సాహములను స్త్రీలకు అందించాలి. కనుక స్త్రీలు చేసే పూజలకు ఏమాత్రం అడ్డు తగలకండి. సంతృప్తికరంగా చేయడానికి అవకాశం యివ్వండి. అది మీకు కూడా మంచిదే.

భారతదేశంలో స్త్రీలకి అగ్రస్థానం, ప్రథమ తాంబూలం యివ్వబడింది. ఉదాహరణము.... లగ్నపత్రికను వ్రాసే ముందు 'శ్రీమతి, శ్రీ' అని వ్రాస్తారు. స్త్రీ పురుషులు, లక్ష్మీ నారాయణ, సీతారాములు, పార్వతీ పరమేశ్వరులు, రాధా కృష్ణులు అంటారు. మొట్టమొదట స్త్రీకే అగ్ర తాంబూలం. భారతదేశంలో స్త్రీకి అంత గొప్పతనం వున్నది. ప్రకృతి అనేది 'స్త్రీ'. ఈ ప్రకృతే లేకపోతే పురుషుడు లేడు. కాబట్టి 'స్త్రీ'కి తగినటువంటి గౌరవాన్ని మనం అందించాలి. తద్వారా నీవు కూడా గౌరవాన్ని అందుకో గలుగుతావు.

*ప్రేమస్వరూపులారా!*

ఈనాటి పవిత్రమైన వరలక్ష్మీ వ్రతమహత్యం యింకా ఎంతెంతో ఉన్నది. లక్ష్మీ స్వరూపులైన స్త్రీలను గౌరవించండి. అప్పుడు లోకం సుఖసంతోషాలతో విలసిల్లుతుంది. ప్రపంచంలో ఏ రాజ్యమునైనా చూడండి. గుణవంతులైన స్త్రీలున్న రాజ్యం సుక్షేమంగా ఉంటుంది. మొదటి, రెండవ ప్రపంచయుద్ధాలలో ఎన్నో రాజ్యాలు నాశనమైపోయినాయి. గుణవంతులైన స్త్రీలు భారతదేశంలో అధికంగా వుండటం చేతనే భారత్‌కు ఏ ప్రమాదం జరుగలేదు. అంతటి గొప్పతనం భారతదేశంలో ఉన్నది. ఆ పవిత్రమైన గొప్పతనం స్త్రీలవలన ఏర్పడినటువంటిదే. కనుక స్త్రీలను గౌరవించి, వారిని ఆనందపెట్టటానికి తగిన కృషి చేయండి. అప్పుడే దేశం కూడా ఆనందంగా, నిత్యకళ్యాణం, పచ్చ తోరణంగా విరాజిల్లుతుంటుంది.

*(ది. 11-8-2000న వరలక్ష్మీ వ్రతముల సందర్భమున, ప్రశాంతినిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)*

## అమృతవాణి

"విరూపతాం, సర్వజనాదవజ్ఞాం
పర్వత్ర దైన్యం, నిజబుద్ధిహైనం
వృద్ధత్వ సంభావిత దుర్దశాంతాం
విచార్యకోవా విరతిం నయాతి?"

ఎవర్కైనా ముసలితనమనేది మహాచెడ్డది. అది రాకుండా వుండదు. వస్తుందంటేనే మహాభయంగా వుంటుంది. కార్ణమేమిటో తెలుసా? ముసలితనం వచ్చేసిందంటే జీవిత మంతా తారుమారై చాలా దుర్భరమౌతుంది. రోజులు యుగాలుగా గడుస్తాయి.

అంతకుమునుపు యౌవనంలో మిసమిసలాడి అందరిని ఆకర్షించిన అందమైన శరీరంకాస్తా ముసలితనంరాగానే చెప్పలేనంత మార్పు చెందుతుంది. ఉన్న దారుఢ్యం తగ్గిపోయి బలహీనమవుతుంది. శరీరంలో అనేక మార్పులు వస్తాయి. కీళ్ళు సడలిపోతాయి. చర్మం ముడుతలు పడుతుంది. దంతాల పటుత్వం తగ్గుతుంది. చూపుమందగిస్తుంది. అడుగులు తడబడతాయి. ఒడలు తూలుతుంది. ఇవన్నీ ముసలితనంలో శరీరానికేర్పడే వికారాలు. ఇది యిలా వుండగా లోగడ గౌరవించినవాళ్ళే చూసీ చూడనట్లు తప్పుకొని తిరుగుతారు. లోగడ చెల్లాయించిన మాటలు ఇప్పుడు వినేవాళ్ళుండరు. ఏంచెప్పినా వినబడనట్లు నటిస్తారు. చిన్న పిల్లలు కూడా లెక్కచేయని స్థితి యేర్పడుతుంది. ఇంత కంటే అవమానం ఏం కావాలి?

ఇంతేకాక యీ సమయంలో ఇంద్రియపటుత్వం తగ్గి విషయాభిలాష పెరుగుతుంది. తినాలనే వాంఛ, తింటే పడదు. చూడాలని వుంటుంది, కళ్ళు మసకలు. అంతటా తిరగాలని వుంటుంది. కాళ్ళనొప్పులు కదలనీయవు. ఇలాంటి కోరికలు తీరక కోపం వస్తుంది. తన కోపం తనకే శత్రువవుతుంది. అసమర్థతకు ఆవేదన కలుగుతుంది.

బుద్ధి పనిచేయటం మానేస్తుంది. ఆలోచనాశక్తి నశిస్తుంది. ఎంత చదువుకొన్నవాడైనా బుద్ధి, సామర్థ్యం కోల్పోటంవలన దైన్యానికి లోనవుతాడు. వర్ణించరానంత హీనస్థితిలో మనిషి దిగులుతో దిగజారిపోతాడు. బాగా బ్రతికినరోజులను తలపోసి కొని యిప్పటి హీనస్థితిలో ఏమీ కదలలేక దుఃఖపడతాడు.

చూస్తూచూస్తూండగానే బలిష్టమై ఒక వెలుగు వెలిగిన శరీరం శక్తిని కోల్పోయి ఈ విధంగా పడరాని పాట్లు పడుతూంటే కూడా జీవిత సత్యం అర్థంకాకపోతుందా? కాటికి కాళ్ళు చాచిన యీ స్థితిలో వైరాగ్యభావం కలగక పోతుందా? ముసలితనాన్ని తల్చుకొంటేనే చాలు విరక్తి పుట్టి తీరుతుంది.

కూటిభట్ల చంద్రశేఖరశర్మ